Regd No: M. 1118

విడిప్రతి 2 అణాలు.

# ఆంధ్రపత్రిక

Founder : K. NAGESWARA ROW. 317239 SUNDAY EDITION

Vol, 35, ANDHRA PATRIKA, MADRAS. 21st NOVEMBER 1948. No. 228





# ఆయుధవిసర్జన సమస్య

## పశ్చిమరాజ్యముల పథకమునకు ఐక్యరాజ్యసమితి ఆమోదం

పారిస్, నవంబరు 19. వివిధదేశములు, తమతమ సాయుధబలముల పరిమాణమును, బయటపెట్టవలెనని కోరుచూ, ఆయుధవిసర్జన సమస్యకు సంబంధించి, పశ్చిమ రాజ్యములు, సూచించిన పథకమును నేడు పెద్ద మెజారిటీతో ఐక్యరాజ్యసమితి ఆమోదించెను. పశ్చిమ రాజ్యముల పథకమునకు అనుకూలముగా 43 ఓట్లు ప్రతికూలముగా 6 ఓట్లు వచ్చినవి. సోవియట్‌రష్యా యీ పథకమునకు వ్యతిరేకముగా ఓటుచేసెను.

పశ్చిమరాజ్యముల పథకం ప్రకారం, ఐక్యరాజ్యసమితి సభ్యత్వంగల దేశములన్నీ తమతమ సాయుధబలగముల సంఖ్యా వివరములను తెలుపుచూ అందజేయు సమాచారమును సంగ్రహించి, తనిఖీచేసి, సమాచారమునంతా పూర్తిగా ప్రచురించుటకుగాను, ఒక అంతర్జాతీయ కంట్రోల్ సంఘము నెలకొల్పబడును. పశ్చిమరాజ్యముల పథకమునకు సంబంధించిన వివరములన్నింటినీ, భద్రతామండలి, ఆయుధాచిత్య నిర్ణయసంఘము కలసి తయారు చేయును.

అగ్రరాజ్యము లైదింటి సైనికబలములను, సంవత్సరములోగా, మూడవవంతు తగ్గించవలెనని, అటంబాంబును నిషేధించవలెనని, అగ్రరాజ్యము లైదు తమతమ ఆయుధసంపత్తికి సంబంధించిన పూర్తి సమాచారమును అధికారరీత్యా, భద్రతామండలి అధ్వర్యమున పనిచేయు అంతర్జాతీయసంస్థకు సమర్పించవలెనని, కోరుచూ సోవియట్ రష్యా ప్రతిపాదించి తీర్మానమును, ఐక్యరాజ్యసమితి త్రోసివేసెను. సోవియట్ ప్రతిపాదనకు ప్రతికూలముగా 39 ఓట్లు అనుకూలముగా అరు ఓట్లు వచ్చినవి. ఓటింగులో అర్గదు పాల్గొనలేదు.

బ్రిటిష్, అమెరికన్, యుద్ధశాఖాధికారులు, యుద్ధంకోసం తీవ్రంగా సన్నాహములు చేయుచున్నారని, సోవియట్

(4-వ పేజీ చూడుడు)

## ప్రపంచ బాంకుకు ఇండియా దరఖాస్తు

న్యూఢిల్లీ, నవంబరు 19 : ప్రాజెక్టులను నిర్మించుటకూ, రైలు ఇంజన్లు, వ్యావసాయక పరికరములు, మొదలైనవాటిని కొనుకోటానికి ఓలుగా తమకు ఋణం మంజూరు చేయవలసిందని ఇండియా ప్రభుత్వంవారు ప్రపంచబాంకు లోగడ దరఖాస్తు పెట్టుకొనిరి. ప్రపంచబాంకు ప్రతినిధులు ఇండియాకుఋణం ఇవ్వవచ్చునో లేదో, చర్చించేనిమిత్తం త్వరలోనే సమావేశం కాగలరని తెలియుచున్నది.

## "కామన్వెల్తు-భారతదేశ సంబంధాల గురించిపారిస్‌లోచర్చజరుగలేదు"

### విదేశాంగశాఖా కార్యదర్శి బాజ్‌పాయ్ ప్రకటన

పారిస్, నవంబరు 19: కామన్వెల్తుతో భారతదేశ భవిష్యత్సంబంధములను గురించి, భారత విదేశాంగ వ్యవహారశాఖ ప్రధానకార్యదర్శి సర్ గిరిజా శంకరబాజ్‌పాయ్, ఆస్ట్రేలియా, కెనడియా విదేశాంగమంత్రులతోటి బ్రిటిషు లార్డు చాన్సలర్‌తోటి ప్యారిస్‌లో సంప్రదింపులు జరిపినట్లు ప్రచారమైనవార్తలు నిజమైనవి కావు. ఈ విషయం నేటిరాత్రి గిరిజాశంకర్ బాజ్ పాయిచే వెల్లడించెను.

కాశ్మీర్ కమీషన్, అనుకున్న ప్రకారం, 2, 3 రోజులలో ఐక్యరాజ్య సమితికి నివేదిక సమర్పించుట సంభవించే యెడల, కాశ్మీర్ విషయంలో భారత ప్రభుత్వ విధానమును సమర్థించుటకు బాజ్ పాయ్ ప్యారిసులో యిప్పుడు ఉండి ఉండవచ్చునని, భారతీయవర్గములలో భావించ బడుచున్నది.

క్రితం బుధవారంనాడు, సర్ గిరిజాశంకర్ బాజ్‌పాయ్, బ్రిటిష్ లార్డ్ చాన్సలర్ లార్డ్ జోవిట్, ఆస్ట్రేలియా విదేశాంగమంత్రి డా॥ ఎవాట్, పియర్సన్ గారల సమావేశం జరిగినది. ఈ సమావేశంలో, కామన్వెల్తు, భారతదేశ సంబంధముల విషయమయి చర్చించబడి ఉండవచ్చునని సమావేశానంతరం ఊహాగానం బయలుదేరినది. కామన్వెల్తులో భారతదేశ స్థానమును గురించి సమావేశములో చర్చించితిరా అని డా॥ ఎవాట్‌ను అడుగగా, ఆయన యే సమాధానము చెప్పలేదు.

ఐక్యరాజ్యసమితి ప్రణాళికపై మొద

5 వ పేజీ చూడుడు

# అనుమానాలు, అపోహలు ఆధారం చేసుకొని నాపై నేరారోపణ చేశారు

## సావర్కర్ వాఙ్మూలము

### "గాంధిజీహత్యను ఇప్పటికిని నేను విస్పష్టముగ ఖండించు చున్నాను"

ఢిల్లీ, నవంబరు 20 : గాంధీ హత్య కేసులో ఏడవ ముద్దాయియగు 65 సం॥ల వృద్ధుడైన వినాయక దామోదర సావర్కరుగారు తన వాఙ్మూలమును న్యాయమూర్తి ఆత్మచరణుగారి యెదుట దాఖలు చేసెను. ఈ వాఙ్మూలము ఇంగ్లీషులో చాలా దగ్గరగా అక్షరాలు టైపుకొట్టబడి 57 పుటలు కలదైయున్నది. ఆ వాఙ్మూలములో యీ క్రిందిరీతిగా వ్రాసిరి.

నేను నిర్దోషినని ప్రమాణముచేసిచెప్పుచున్నాను. నామీద ఆరోపింపబడిన నేరములు దేనిని నేనుచేయలేదు. అట్టి నేరములను చేయవలసిన సందర్భ కారణముకూడా లేదు. చార్జిషీటులో చెప్పబడిన నేరములకు నేను మద్దతుయివ్వలేదు. కనుక నన్ను నిర్దోషినిగా పరిగణించి వెంటనే విడుదల చేయవలసినదని ప్రార్థించుచున్నాను.

నామీద ఆరోపింపబడిన నేరములకు సాధారణంగా క్రిమినల్ కేసులలో చూపబడవలసిన సాక్ష్యపూర్వప్రమాణములు చూపబడలేదు. కేవలము అనుమానాలమీదను అపోహలమీదను ఆధారపడి నామీద నేరాలు ఆరోపించిరి. గాంధిమహాత్ముణ్ని పండిత జవహరిలాలు నెహ్రూగారిని నేను అత్యంతము గౌరవించుచుంటిని. నాగౌరవ భావమునకు తార్కాణముగా అనేకపర్యాయములు పత్రికలలో నేను ప్రకటించుచుండిన అభిప్రాయ ప్రకటనలను వ్యాసములను చూడవచ్చును. వారిని బ్రిటిష్ ప్రభుత్వము అరెస్టు చేసినప్పుడు నేను బ్రిటిష్ గవర్నమెంటువారి చర్యలను ఖండించుచుంటిని. గాంధిమహాత్ముని సొంత కుటుంబమునకు కష్టము కలిగినప్పుడుకూడా ఆయనయెడల నా సానుభూతిని వెల్లడించితిని. ఆయన విడుదలయైనప్పుడు అనందించితిని. ఆయన 75-వ జన్మదినమున ఆయన దీర్ఘాయురారోగ్యముల కై భగవంతుని ప్రార్థించితిని. నాకు ఆయనకు రాజకీయసిద్ధాంతములలో అభిప్రాయభేదము లుండినప్పటికి అవ్యక్తిగతవిద్వేషములుగా నాకెప్పుడును మారలేదు.

గాంధిమహాత్ముడు హత్య గావింపబడిన తోడనే యీ హత్యను ఖండించుచు బహిరంగప్రకటన చేసితిని. నేటికిని ఆహత్యను విస్పష్టముగా ఖండించుచున్నాను.

#### నాజీవిత చరిత్ర విశేషములు

నాజీవితచరిత్ర విశేషములను క్రిందిగా

[5 పేజీ చూడుడు]

## బెల్జియం మంత్రివర్గ రాజీనామా

బ్రెస్సెల్స్, నవంబరు 19 : షుమారు 20 మాసములగా బెల్జియం పరిపాలన నిర్వహించుచున్న హెన్రీ స్పాక్ సోషలిస్టు కాథలిక్ మిశ్రమ మంత్రివర్గం నేడు ఉదయం రాజీనామాయిచ్చినది. రాజీనామాను, బెల్జియం రీజెంట్ చార్లెస్ అంగీకరించినట్లు అధికారపూర్వకముగా ప్రకటించబడెను.



లజపతిరాయ్ వర్ధంతి ఉత్సవం: న్యూఢిల్లీలో జరిగిన సభకు అధ్యక్షతవహించిన నూత్నరాష్ట్రపతి డా॥ పట్టాభిగారు, సభలో ఉపన్యసించిన సర్దార్ వల్లభాయ్‌పటేలు 'చట్టాపట్టాలు' వేసుకొని నిల్చున్నారు.

## జాతీయ భాషా సమస్యపై కాంగ్రెస్ కార్యవర్గ చర్చ

న్యూఢిల్లీ, నవంబరు 19 : షుమారు వారంరోజులుగా ఇక్కడ జరుగుచున్న కాంగ్రెస్ కార్యవర్గ సమావేశములు నేటితో పరిసమాప్తియైనవి. నేటి సమావేశంలో, జాతీయభాషా సమస్య, వ్యవసాయ సంస్కరణలకు సంబంధించిన అనేక సూచనలు, చర్చింపబడినవి. భాషాసమస్యపై కార్యవర్గం యే నిర్ణయమునకు రాలేదు.

# నైరుతి ఆఫ్రికా భవిష్యత్తు

## ధర్మకర్తృత్వ సంఘంలో భారత ప్రతినిధివర్గ సవరణతీర్మాన ఓటమి

పారిస్, నవంబరు 19: నైరుతి ఆఫ్రికాభవిష్యత్తుకు సంబంధించి, భారతప్రతినిధివర్గం ప్రతిపాదించిన సవరణ తీర్మానము ఒక ఓటు తేడాతో నేటిరాత్రి ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వసంఘములో వీగిపోయెను. సవరణ తీర్మానమునకు అనుకూలముగా 21 ఓట్లు ప్రతికూలముగా 22 ఓట్లు వచ్చినవి. 11 గురు ఓటింగుకు గైరు హాజరైనారు.

నైరుతి ఆఫ్రికాను ధర్మకర్తృత్వ పాలనక్రింద ఉంచవలెనని, దక్షిణఆఫ్రికా ప్రభుత్వం తన ధర్మకర్తృత్వ పరిపాలనకు సంబంధించి వార్షిక నివేదికలను ఐక్యరాజ్యసమితికి సమర్పించవలెనని నైరుతి ఆఫ్రికాను, తనలో కలుపుకొనుకుట దక్షిణాఫ్రికా ప్రభుత్వం యొట్టిప్రయత్నము చేయగూడదని, నైరుతి ఆఫ్రికాకువెళ్లి అచటి స్థితిగతులను పరిశీలించుటకై ధర్మకర్తృత్వసంఘం ఒక కమీషన్‌ను నియమించవలెనని భారత ప్రతినిధివర్గం తమ సవరణ తీర్మానములో శిఫార్సుచేసెను.

ఈ సవరణను త్రోసిపుచ్చుచూ, ధర్మకర్తృత్వసంఘం యీ దిగువ తీర్మానమును ఆమోదించెను.

"నైరుతి ఆఫ్రికా విషయమై ధర్మకర్తృత్వ సంఘము తమనివేదికలో వుదహరించిన అభిప్రాయములను ఐక్యరాజ్యసమితి గమనించి ఆ అభిప్రాయములను, దక్షిణాఫ్రికా ప్రభుత్వమునకు తెలియపర్చవలసినదిగా సమితి ప్రధాన కార్యదర్శికి విన్నవించుకొను చున్నది.

1946 డిశంబర్ 14వ తేదీ నుండి 1947 నవంబరు 1 వ తేదీవ, నైరుతి ఆఫ్రికాను ధర్మకర్తృత్వ పాలనక్రింద పెట్టవలసినదిగ కోరుచూ, సమితి ఆమోదించిన తీర్మానములందలి శిఫార్సులను దక్షిణాఫ్రికా

(4-వ పేజీ చూడుడు)

# కమ్యూనిస్టులపై చైనా ప్రభుత్వ సేనల ఎదురుదాడి

## సుచౌ యుద్ధంలో 2 లక్షలకమ్యూనిస్టు సేనలు హతమైనట్లు అధికార అంచనా

నాన్‌కింగ్, నవంబరు 19 : చైనా రాజధానికి ముఖద్వారమైన సుచౌకు, వాయవ్యంగా, కమ్యూనిస్టుసేనలపై ప్రక్కవాటుగా ముట్టడి చేయవలెననే సాహసంతో, జనరలిజో చాంగ్‌కైషేక్ సైన్యం తాలూకు రెండు బలీయమైన దళములు, ఉత్తరదిశగా త్వరితగతి సాగిపోవుచున్నవి.

నాన్‌కింగ్ ఉత్తరముగా 200 మైళ్ల దూరములోనున్న సుచౌవద్ద పదిరోజుల ప్రచండ పోరాటానంతరం కమ్యూనిస్టుసేనలపై అఖండవిజయములు సాధించినట్లు ప్రభుత్వసేనలు చెప్పుకొనినవి. కాని, కమ్యూనిస్టు సేనానాయకులు, లియూపొచెంగ్, చెంకింగ్, కొత్త దాడులకు సన్నద్ధమై యున్నట్లు నేడు తెలియవచ్చినది. ఈ సేనానాయకుల బలములకు, వెనుకభాగమున రాకపోకల రవాణామార్గములను చేదించుటకే పై తెల్పిన రెండు ప్రభుత్వదళములు, ఉత్తరాభిముఖముగా సాగిపోవుచున్నట్లు చైనా పత్రికావార్తలవల్ల తెలియుచున్నది.

ఈ రెండు దళములలో ఒకటి, చాంగ్‌చెంగ్ నాయకత్వమున, దక్షిణహోనాన్ లోని సిన్‌యాంగ్‌నుంచి, పీపింగ్ హాంకో రైలుమార్గం పైపుగా శరవేగమున పురోగమించు చున్నది. రెండవదళము, హువాంగ్ వె నాయకత్వమున, వాయవ్య అన్‌హ్వాలోని యాంగ్‌నుంచి, సాగిపోవుచున్నది.

హుచేకు ఉభయ పార్శ్వముల తమ సేనలు పురోగమించినట్లు, సుచేకు దక్షిణమున సుబ్‌సీన్‌పై కమ్యూనిస్టుల ముట్టడి ఛేదించబడెనని, 25 వేలమంది కమ్యూనిస్టు సైనికులు హతమైనారని ప్రభుత్వ వార్తలు తెలుపుచున్నవి.

నగరమునుంచి, ధనిక కుటుంబములు దక్షిణముగా పారిపోవుటను షాంగ్‌హే దళాధిపతి తీవ్రముగా గర్హించుచూ, వీరంతా కట్టె నీచులని వర్ణించెను. ఇలా పారిపోవుట, పరోక్షముగా కమ్యూనిస్టులకు లొంగిపోవుటేనని, యీ వలస నిరోధనకు -వినచర్య తీసుకొనబడునని, యీ సాపతి హెచ్చరించెను.

...ంకాంగ్, టియోవాన్‌లకు వెళ్లేయే ...చూచినా, యే విమానంలో చూచి షాంగ్‌హే ధనికులే క్రిక్కిరిసి ఉన్నారు. పోతే పేదలు మాత్రం,షాంగ్‌హె నాన్‌కింగ్, షాంగ్‌హె హాంగ్‌చే

(4-వ పేజీ చూడుడు)

# నూతనస్థితిగతులకు అనుగుణముగ సంస్థానకాంగ్రెసులక్ష్యము మార్పు

## కార్యవర్గం అత్యవసరసమావేశంలో చర్చ జరిగినదని అధికార ప్రకటన

హైదరాబాదు, నవంబరు 19: హైదరాబాద్ సంస్థాన కాంగ్రెస్ కార్యవర్గం గత రెండు రోజుల అత్యవసర సమావేశంలో 'స్థితిగతులలో కలిగిన ముఖ్యమయిన మార్పులదృష్ట్యా సంస్థ లక్ష్యమును మార్చే విషయమై' యోచించెనని సంస్థాన కాంగ్రెస్ కార్యాలయము నుండి ఈ రాత్రి వెలువడిన ప్రకటనలో తెలియజేయబడెను.

సంస్థాన కాంగ్రెసు లక్ష్యములలో ఏది మార్పు చేయబడునో ఈ ప్రకటనలో లేదు. కాని, 'నూతనలక్ష్యము, భారతదేశముతో ఏకమై యుండవలెనన్న సంస్థాన కాంగ్రెస్ ఆశయము ననుసరించి, భారతదేశములో స్వేచ్ఛాయుత లౌకిక ప్రజాస్వామిక రాజ్యం ఏర్పాటు చేయవలసిన జాతీయ ఆవశ్యకత ననుసరించి, ప్రజలకు ప్రజాస్వామ్య జీవితము, సాంఘిక ఆర్థిక స్వాతంత్ర్యము సంపాయించవలెననెడి ఆశయము ననుసరించి ఉండునని మాత్రము ఆ ప్రకటనలో సూచింపబడెను. 'హైదరాబాద్ ప్రజలు తమ భవిష్యత్తును యావద్భారత విధానము నకు లోబడి నిర్ణయించుకొన' వలసి వుండునని, ఈ చేయనున్న మార్పును ఏపదములలో నిర్వచించవలెనో కార్యవర్గము మరల ఈ నెల 27 న సమావేశ మయినప్పుడు ఆలోచించబడునని, పిమ్మట అఖిల హైదరాబాదు కాంగ్రెస్ సంఘం ఆమోదమునకు సిఫార్సులు చేయబడునని ఆ ప్రకటనలో కలదు. (అ. ప్రె)

# జమీందారీరద్దు బిల్లు

## రైతులకు మేలు చేయదని విమర్శ

### కౌన్సిల్‌లో చర్చ

మదరాసు, నవంబరు 20:

ప్రశ్నల కాలా నంతరము శుక్రవారం రాష్ట్ర కౌన్సిల్‌లో ఎస్టేట్ల రద్దు బిల్లుపై చర్చ ప్రారంభమైనది. శ్రీ ఆర్. సూర్యనారాయణరావు ప్రసంగించుచూ, బిల్లునుంచి కొన్ని ఈనాములను తొలగించుట సమంజసముగా లేదనిరి. తొలగించిన అన్ని ఈనాములను తొలగింపవలెను లేక అన్నింటిని చేర్చవలెను. అది అటుంచి, ఈ బిల్లు ద్వారా రైతుకు ప్రభుత్వమునకు మధ్య దళారులు లేకుండగా చేయ సంకల్పించుచున్నట్లు మంత్రిగారు చెప్పుచుండిరి. కాని రైతుకు అనేక చిక్కులు సంక్రమించుచున్నవి. బిల్లు వలన దళారులందరునూ తొలగిపోరు. రైతులకిప్పుడో ముందుముందో మేలు చేసెదనని మంత్రిగారు ప్రకటించు అవసరకత ఏమి? ఆ మేళ్లను ఇప్పుడే ఏల చేయరాదు. పైగా ఈ బిల్లుద్వారా జరుగు పని చాలా చిన్నది. ఎస్టేట్ దారులను తొలగించుట మాత్రమే. పరిహారము, సక్రమమైనదిగా నుండవలెనని మంత్రిగారు కూడా భావించుచున్నచో, అట్టి పరిహారము సెక్షన్ 299 (ఇండియా చట్టము)ను తృప్తిపరచగలదా అని చూడవలెను. పరిహారము పేర "అరిక పత్రముల" నిచ్చుట సక్రమము కాదని భారత ప్రభుత్వపు అడ్వకేట్ జనరల్ అభిప్రాయము. నిలవనిధినుండి ఖర్చు పెట్టవచ్చునని మంత్రిగారు అనుకొనుచుండిరేమో—కాని అట్టిది సాధ్యముకాదు. చివరకు ఇది ఒక జటిలమైన అవివేక కార్యముగా పరిణమించునేమో! కాని మంత్రిగారు మాత్రము తమ నియోజకవర్గమునకు పోయి, "నేనీ బిల్లును సాధించితిని" అని చెప్పుకొనవచ్చును.

శ్రీ వెంకటరావు:—గౌరవ సభ్యునికి నియోజకవర్గమే లేదుకదా.

శ్రీ సూర్యనారాయణరావు:—దేశమే మా నియోజకవర్గము (మంత్రి:—అది మరీ బాగున్నది!) దేశాభివృద్ధికై డబ్బును ఉపయోగించుటకు మంత్రిగారు కృషిచేయుట మంచిదనిరి.

డా॥ వి. కె. జాన్ మాట్లాడుచూ, మంత్రిగారు తమ ఉపన్యాసములో యీ బిల్లును చర్చిల్ కూడా సమర్థించుచున్నట్లు చెప్పుకొనుటను విమర్శించిరి. చర్చిల్‌కు ఈ బిల్లుయొక్క నిజస్వరూపము తెలియకుండవచ్చును. ఈ బిల్లుయొక్క తక్షణ ఫలితములు చాలా ప్రమాదకరముగా నుండును. ముందు కొన్ని కోట్లరూపాయలు పరిహారము క్రింద ఖర్చు అగును. యింతవరకు న్యాయపరిభాషలో యీ ఎస్టేటు దారులను "భూమియజమానులు" (ప్రొప్రైటర్లు) అనే వాడుచున్నారు. శాసనసభలయందును అదేమాట వాడబడినది. పైగా జమీందారులను తొలగించినంత మాత్రమున, రైతుకు తొలగిన పెద్దకష్టములేమి? ఒక క్రొత్త తరగతి భూకాముందులు తయారగుదురు. జమీందారులకంటె, ఇట్టి భూకామందులే రైతులను పీల్చుకొని తినుచున్నారు. భూమిని దున్ను రైతు, భూస్వామి కివ్వవలసిన అద్దెను మంత్రిగారేల నిర్ణయింపలేదు? ఇట్టి నిర్ణయము చేయకుండుటవలననే కమ్యూనిజం వ్యాప్తి చెందుచున్నది. అసలు 1802 సెటిల్మెంటుబిల్లులో "ఈ ఎస్టేటు దారుల యజమానిత్వమును స్థిరపరచుటకు—"అని భూమికలో కలదు. న్యాయశాస్త్రము ద్వారా వీరు యజమానులే. మంత్రిగారు, వీరు యజమానులు కారని ఎట్లనగలరు?

శ్రీ వెంకటరావు: కాని 1939 లో మాన్య శ్రీ జోగయ్యపంతులు, వీరు యజమానులుకారని ప్రవేశపెట్టిన తీర్మానము సభలో అంగీకరింపబడినది.

డా॥ జాన్: అంతమాత్రమున న్యాయశాస్త్రము మారదు. వీరి "యజమాని హక్కుల"ను తొలగింపవచ్చును. కాని వీరు యజమానులే కారని అనుట అక్రమము. అసలు బిల్లును మొదట ప్రకటించినప్పుడు "యజమాని" అనే వాడిరి. కాని తర్వాత వారు యజమానులు కారనిరి. హెచ్చు తగ్గుల నతిక్రమించు బనులు, శాసనములను అగౌరవపరచుట బాగుగా లేదు. అని డా॥ జాన్ విమర్శించుచుండగా, సభ అల్పాహారముకు లేచినది.

నిన్న అల్పాహారానంతరము డా॥ వి. కె. జాన్ గారు మదరాసు కౌన్సిలులో తమ ఉపన్యాసమును కొనసాగించుచూ, ఇనాందారులలో కొందరికి రెండువరముల హక్కులు ఉన్నవనియు, కొందరికి ఒకేవరమున్నట్లును ప్రివీకౌన్సిల్‌లో తీర్పు ఇవ్వబడినదనిరి. వీరికికూడా యజమాని హక్కులున్నవని నిరీక్షింపబడినది. కాని వీరందరికిని ఒకే సూత్రప్రకారం ఈ హక్కులు తొలగింపబడుచున్నవి. అనేకులు, జమీందారులు దుర్వ్యయముచేయుచు, సంఘమునకు క్రొవ్వగానుండగా సంచరించుచున్నమాట వాస్తవమే. కాని బిల్లువలన బాధపడు వీరవారిని గురించి సావధానముగా ఆలోచించక తప్పదు. బిలులోని 3 సెక్షనులో "ఈ జమీందారీ భూములపై హక్కులన్నియు ప్రభుత్వమునకు సంక్రమించును" అని ఉన్నది. రైతులకు పట్టా లిచ్చుటకు మారుగా, ఈ భూములపై హక్కులను ప్రభుత్వమేల స్వీకరింపవలెను? స్వీకరించి, అధిక శిస్తులను తీసికొనుచూ బాగుపడుచున్న జమీందారునకు, పరిహారమిచ్చుటమేల? పరిహారమిచ్చి ప్రజాధనమును వ్యయపరచుట ఏల? ఆభూమి ఎవరికి చెందునో చూచి, అతనినే పరిహారం చెల్లించుకొనమని ఆదేశింపవచ్చునుకదా. బిల్లువలను జరుగుటవలన కోటిరూపాయల వార్షికాదాయము లభించునని మంత్రిగారనుచున్నారు. కాని ఈ కోటిరూపాయలలో, శిస్తువసూలు, ఖర్చులు, పరిహారముక్రింద ఇచ్చిన ధనముపై వడ్డీని తీసివేసినచో, మిగులు ఆదాయమెంత? దాదాపు ఏమియునుండదే! ఇంగ్లండ్‌లోని లేబర్ పార్టీ, పరిశ్రమలను జాతీయము చేయుచూ, సామాన్యుల జీవితములో అభివృద్ధికరమార్పులను చేయుచున్నది. కాని ఈ బిల్లువలన అట్టిపని జరుగుటలేదు. జమీందారును మాత్రము తొలగించి, దళారులను "స్థిరోభవ" చేయుచున్నారు. ప్రజాధనము నింతవ్యయపరచుచూ కూడా దళారులనందరను తీసివేయలేకున్నారే. అనేకులింకనూ రైతులవద్దనుంచి విపరీతముగా అద్దెలను, తీసుకొనుచున్నారు. పార్టీ ఓట్లబలములో బిల్లు ఆమోదమును పొందవచ్చును. కాని బిల్లు ఫలితములు దారుణముగానుండును. ఇది సమగ్రమైన సంస్కరణకాదు. ఇంతికంటె, కొన్ని సంవత్సరముల గడువునిచ్చి, రైతులనే వాయిదాలలో జమీందారునకు పరిహారము చేయమనుడు. రైతులు ఉత్సాహముతో అధికోత్పత్తిచేసి, అప్పును తీర్చుకొని, భూమిని స్వంతముచేసికొనెదరు. వారికి సంపూర్ణ సౌకర్యములనిండు. సమస్య తీరిపోవును. కాంగ్రెసు హైకమాండువారు సంపూర్ణ పరిహారమిచ్చి, దళారులనందరను తొలగింపవలెనని తీర్మానించిరి. ప్రభుత్వమువారు రైతుకు సంపూర్ణ సౌకర్యములనిచ్చి, పరిహారమును వాయిదాలలో చెల్లించు శక్తిని కల్గించి, జమిందారునకు రైతునకు గల సంబంధములను ప్రభుత్వమే నడిపి, గొప్ప వ్యవసాయ సంస్కరణను చేయవచ్చును. చక్కటి సహకార వ్యవస్థను నిర్మింపవచ్చును. ఇవి అన్నియు కాదని, ఇందరు దళారుల ప్రాబల్యమును ఇంకనూ సంరక్షించుచుండుటకు ప్రయత్నించు ప్రభుత్వ విధానమునకు ఆమోదము నివ్వరాదు. బిల్లు ద్వారా అసాధారణాధికారములను స్వీకరించుచూ, ప్రభుత్వ కార్యక్రమములను కేవలము మంత్రులు ఇచ్చవచ్చిన రీతి తీస్తూ, బోలెడు సిబ్బందిని నియోగించి నిరంకుశముగా పాలింపవలెనని మంత్రుల అభిప్రాయము. కోర్టులన్న నమ్మకములేదు. సిబ్బందిని ఏరుకొనుటకు పబ్లిక్ సర్వీసు కమిషనుకు హక్కులేదు. ఆ కమిషనును అటవికముపై పంపివేసినారు! ప్రజా ప్రభుత్వమువారు చేయుచున్న ఈ చర్య ఫలితములు ఊహింపరానంత ఘోరమైనవని హెచ్చరించుచున్నాను అని డా॥ జాన్ ముగించిరి.

శ్రీ పసుమర్తి వీరభద్రస్వామిగారు జమీందారీ బిల్లును తెచ్చి సామాన్య రైతుకు సహాయ్య పడుచున్నందుకు రెవిన్యూ మంత్రి శ్రీ కళా వెంకట్రావుగారిని అభినందించిరి. భూమిశిస్తు విధానము, జమీందారీలలో ఒక విధముగా రయత్వారీ ప్రాంతాలలో మరొక విధముగా నుంటున్నదనియు, అట్టి తారతమ్యంవల్ల రైతుకు చాలా నష్టము కలుగుచున్నదనియు అన్ని ప్రాంతాలలో ఒకే శిస్తువిధానము అమలు పరుచుట అత్యావశ్యకమనియు నుడివిరి. జమీందారీలలో చాలా వీంఢ్లనుండి విశేషపన్ను భారమును భరిస్తూ బాధపడిన రైతులకు యీ శాసనంవల్ల మేలు కలుగును. గాన యీ బిల్లును తాను మనఃపూర్వకముగా ఆమోదించుచున్నాననిరి.

రెవన్యూ:—నష్టపరిహారం యివ్వవలసివుంటే, ద్రవ్యరూపంగా ఉన్నప్పుడే యిచ్చుట మంచిది. లేకున్న యివ్వవచ్చు.

ఆ. గోవిందాచారి:—నష్టపరిహారం యివ్వరాదని నే జనను. అనుకూలమయినపుడు యివ్వవచ్చు. జమీందారులకు పూర్తిగ భూమి లేకుండా చేయరాదు. కొందరు జమీందార్లు బిచ్చగాండ్లయిపోతారు. పూర్వీకులు చేసిన తప్పునకు వీరిని శిక్షింపరాదు. ఈ చట్టములో యిట్టి నిర్ణయాలను నేను అంగీకరించలేను.

డా॥ జాను:—మాతో ఓటు చేస్తారా.

ఆ. గో: నేను స్వతంత్రుడనయితే అంగీకరించియుందును. పార్టీ విధులూచ్చి మందే చెప్పియున్నాను. సెలెక్టుకమిటీలో నే చెప్పిన సవరణలు మంత్రిగారంగీకరించలేదు. కాని తరువాత అన్ని చట్టంలో చేర్చిరి. ఇనాందారులు కొందరిని మినహాయించిరి. మరికొందరికి అన్యాయంచేసిరి. ఇనాముల దేవుళ్ళ రికార్డు చూసియుంటే వారికి రెండు రకములు ఉన్నట్లు తెలియగలదు. మా తాతగారు విద్వాంసులయ్యును స్వయంగా దున్నుకొనేవాడు. కనుక ఇనాందారులు సోమరులనుకోరాదు. బహుశః రెవెన్యూమంత్రిగారుకూడ అట్టి ఇనాందారు కుటుంబములోనివారేమో!

రె. మంత్రి: నా యింటిపేరే ఆ విషయం విశదం చేయుచున్నది.

ఆ. గోవిందాచారి: ఆ! కళావారా! ఇపుడు ఆ కళయని యింకో అక్షరం చేర్చాలి. మంత్రిగారు పార్టీలోగాని, సెలక్టు కమిటీలోగాని చర్చించవలసినంటి సవరణలు ఎందుకు చేర్చాలి. ఇనాములు జమీందారీలుకావని వాటిని, మధ్యవచ్చినవారుగ చూడరాదని కాంగ్రెసు ఉన్నతాధికారులు సూచించిరి.

కళా: మీరు ఆవిషయములో పొరబడుచున్నారు.

ఆ. గోవిందాచారి: మీరు సభలో చదవలేదు. కావలసింటే ఆ ఉత్తరువులు చదవండి. నామాట తప్పయితే రాజీనామా నిచ్చి పోతాను. చాలెంజి చేస్తున్నాను. మీరా ఉత్తరువులు చదువగలరా? (జవాబులేదు) పొలాలు అమ్ముకోరాదని ప్రభుత్వంవారు శాసించలేదు. కనుక రయితులు తమ కౌలు హక్కులు అమ్మేసుకొనిరి. 1945 సం॥ తరువాత అట్టిహక్కులు కొన్నవారికి అవి చెందవని యీచట్టంలో చెప్పిరి. 1945 ఎందుకు నిర్ణయించారయ్యా అంటే కాంగ్రెసు ఎన్నికల ప్రణాళిక ఆయేడు ప్రచురించేసున్నారు. 1945 తరువాతఅమ్ముడయిన భూములు ఎవరికి చెందుతాయి. కొన్నవారికి నిరాకరిస్తే? ఇనాములు రద్దు చేస్తామని యిదివర కెన్నడు చెప్పలేదు, ప్రకాశం నివేదికలోగూడా సూచింపలేదు. అపుడు కాంగ్రెసు గవర్నమెంటే యుండెను. కరంతుగారి జమీందారీ బిల్లులో కూడా, ఇనాములు మినహాయించబడినవి. అంతవరకు కాంగ్రెసు విధానంలో మార్పులేదు. కాని మంత్రివర్గంలో వ్యక్తులు మారినందున, యీ సిద్ధాంతం బోల్తాకొట్టింది. అవ్యక్తుల మార్పుకే నేను బాధ్యుడనే (నవ్వు.)

కళా: మళ్లా మార్పుకే ప్రయత్నించండి.

ఆ. గో. ఆచారి: నేను పశ్చాత్తాపం పడేవాడిని కనుక ఆవిషయం చెపుతున్నాను. ఇనాందారు కాంగ్రెసునకు చాల బలంగానుండిన మధ్యతరగతివారు. వారంతా స్వాతంత్ర్య సంపాదనకు బాగుగ తోడ్పడిరి. ముఖ్యంగా ఆంధ్రదేశంలో కాంగ్రెసు ఉద్యమమునందు ఇనాందారు కుటుంబాలు బాగా త్యాగంచేసిరి. వారిని యిపుడు సన్యాసులుచేయడం భావ్యమా? వారి పొలాలు యితరులకు యిచ్చేస్తారా?

గోవిందాచారిగారు మాట్లాడుచుండగా 4-30 గం. అయినందున సభ మరునాడు 12 గంటలవరకు వాయిదాపడెను.

## ప్రాతిపదిక విద్యాపథకం: విద్యామంత్రి వివరణ

విద్యామంత్రి అవినాశిలింగంగారు నేడు ప్రాతిపదిక విద్యా సమావేశములో మాట్లాడుచు ప్రాథమిక విద్యలో ప్రథమ సోపానంగా ప్రభుత్వంవారు, హిందూస్తానీ తాలిమీ సంఘంవారు తయారుచేసిన ప్రణాళికను పాఠశాల లన్నిటిలోనూ, మొదటి 5 సంవత్సరముల విద్యా ప్రణాళికలో, అమలు జరుపుతారని చెప్పిరి. ప్రస్తుతము రాష్ట్రములో 18 ప్రాతిపదిక విద్యాశిక్షణ కేంద్రములు, 1588 ఉపాధ్యాయులకు తరిఫీదు నిచ్చుచున్నవి. వచ్చే ఏడాది 34 క్రొత్త శిక్షణ కేంద్రాలను పెట్టదలచిరి. రాష్ట్రంలోని అన్ని శిక్షణ కేంద్రాలను ప్రాతిపదిక విద్యాశిక్షణ కేంద్రాలుగా మార్చుటకు ప్రభుత్వంవారు ఉత్తరువు లిచ్చిరి. ఉపాధ్యాయుడు బాలురకు పాఠములు చెప్పుటయేకాక, వయారసము చూపుచు వారికి సచివుడుగా మిత్రుడుగా వ్యవహరించవలసియుండును. ఈ విప్లవము, తిరిగి శిక్షణ పొందినవారివలననే లభ్యము కాగలదు. 1,25 వేలమంది ఉపాధ్యాయులకి పునః శిక్షణ ఇవ్వవలసి యుండును. దీనికిగాను అనేక కోట్లు ఖర్చు కాగలదు. ఈ ప్రణాళిక అమలు జరుగుతూవుండగా రెండేండ్లలో ఒక ప్రాతిపదిక పరిశ్రమను నేర్చుకొన్నచో చాలా మంచిది. పిల్లలకేగాక, పిల్లల తలిదండ్రులకు కూడ విద్య గరపవలసియున్నది. ఇందుకొరకు ప్రభుత్వంవారు ఒక విద్యాప్రచార పత్రిక నడుప నాలోచించుచున్నారు.

## రాంజీట్రాఫీ క్రికెట్‌పోటీ

### బరోడాజట్టు విజయం

హైదరాబాద్, నవంబరు 18: హైదరాబాద్ బరోడా జట్టులమధ్య గత మంగళవారం ప్రారంభమైన రాంజీ ట్రాఫీ క్రికెటుపోటీ నేడు బరోడా జట్టు విజయంతో సమాప్తమయ్యెను. హైదరాబాద్ జట్టునకు మొదటి ఇన్నింగ్సులో 80 రెండవ ఇన్నింగ్సులో 80 పరుగులు వచ్చినవి. బరోడాజట్టునకు మొదటిఇన్నింగ్సులో 98 పరుగులు వచ్చినవి. రెండవ ఇన్నింగ్సులో బరోడాజట్టు, యిద్దరు అవుటయి 65 పరుగులు సంపాదించెను. బరోడాజట్టులోని సోహిని, హైదరాబాద్ జట్టులో 6 గురిని అవుటుచేసెను. ఇప్పుడు బరోడా జట్టును, గుజరాత్ జట్టుకు డిసెంబరు మధ్యలో పోటీ జరుగును.

# ప్రభుత్వవిధానప్రాతిపదికలపై రాజ్యాంగపరిషత్తు చర్చ

## సూచనలుగ గాక ఆదేశములుగ నుండవలెనను సవరణల తిరస్కృతి

న్యూఢిల్లీ, నవంబరు 19: నేడు భారత రాజ్యాంగ పరిషత్తు పరిపాలనా క్రమమును సూచించే సూత్రాలనూ, జాతీయ సర్వతోముఖాభివృద్ధికి అనువైన సాంఘికవ్యవస్థను నిర్మించు విషయమునూ చర్చించినది. ఈ అంశములు రాజ్యాంగ ముసాయిదాలో నాల్గవ అధ్యాయంలో ఉన్నవి. ఈ అధ్యాయంపేరు "పరిపాలనా క్రమ సూచక సూత్రములు". ఈ పేరులోనుండి 'సూచక' అనే పదాన్ని తొలగించి 'పరిపాలనా క్రమ సూత్రము'లని రూఢియగునట్లు చేయవలెనని కరీముద్దీన్ గారు, 'సూచక' అన్న మాటను తొలగించి, దాని స్థానంలో 'ప్రాథమిక' అన్న పదాన్ని చేర్చవలసినదని హెచ్. వి. కామత్ గారు, సవరణలను ప్రతిపాదించిరి. కాని చర్చ జరిగినమీదట కరీముద్దీన్ సవరణ వీగిపోయెను. కామత్ తన సవరణ నుపసంహరించుకొనెను.

ఈ సూత్రములను ప్రభుత్వము అతిక్రమించుటకు వీలులేకుండా వాటిని నిర్బంధము చేయుచూ రాజ్యాంగములో సవరణ చేయవలెనని ప్రొ॥ కె. టి. షా గారొక సవరణను ప్రతిపాదించిరి. "ఈ సూత్రములను ఏ న్యాయస్థానమూ విధిగా అమలుపరప లేదు" అని ప్రారంభంలోనే వ్రాయబడిన వాక్యాన్ని ఆయన అతి తీవ్రంగా విమర్శిస్తూ, అవి ఆచరణలోకి వచ్చునట్లుగా ఏ ప్రభుత్వమునైనా నిర్బంధించు అధికారమును ప్రజల కివ్వలేకపోతే పరిషత్తు తనబాధ్యతను విస్మరించినట్లవుతుందని అన్నారు. ఈ సవరణకూడా వీగిపోయినది.

30 వ అంశంలో చెప్పబడిన 'జాతీయ జీవితంలో అంతటా సాంఘిక రాజకీయ న్యాయమును కలిగించే సాంఘిక వ్యవస్థను ఏర్పరచటంద్వారా ప్రభుత్వం ప్రజల శ్రేయోభివృద్ధికి తోడ్పడుటకు ప్రయత్నించవలెను' అన్న వాక్యంలోని 'ప్రయత్నించవలెను' మొదలైన మాటలమీదతీవ్ర చర్చ జరిగినది. సోషలిస్టు సభ్యుడు దామోదరస్వరూప్ 'సాంఘిక వ్యవస్థ' అనుటకు బదులు 'డెమోక్రటిక్ సోషలిస్టు వ్యవస్థ' అనవలెనని ప్రతిపాదించెను. ఈ సవరణ కూడా వీగిపోయెను. మద్యపాన నిషేధమును రాజ్యాంగములో ఒక ప్రధానసూత్రముగా చేయవలెనని కాజీకరీముద్దీన్ గారు చేసిన ప్రతిపాదనపై చర్చజరుగుతుండగా సమావేశము వాయిదాపడినది.

నాలుగో అధ్యాయపుపేరు 'పరిపాలనా క్రమసూచక సూత్రములు'లో నుంచి 'సూచక' అనే మాటను తొలగించవలెనని కరీముద్దీన్ గారు ప్రతిపాదించుచూ ఈ క్రింది విధముగా వాదించిరి: "ఈ అధ్యాయములో చెప్పబడిన సూత్రములను అనుల్లంఘనీయములుగా న్యాయస్థానములు అమలు జరుపుటకు వీలులేనిచో, వాటివలన ప్రజలకు కానీ, దేశానికి కానీ ఏమి లాభం కలగదు. డా॥ అంబేద్కర్ గారు ఇతరత్రా వ్రాసిన పుస్తకాలలో ఒకచోట ఈ సూత్రాలను ప్రాథమిక సూత్రాలుగా రాజ్యాంగంలో చేర్చవలెనని చెప్పి ఉన్నాడు. ఈ అధ్యాయంలో కొన్ని అంశములు ఎంతో అస్పష్టంగా ఉన్నవి. 31 వ అంశంలో, ఆర్థికంగా, సాంఘికంగా, ఇతర విషయాల్లో, దేశం అభివృద్ధి పొందవలెనని చెప్పబడినది. ఇటువంటి అస్పష్టమైన అంశాలవలన ప్రయోజనం ఏమిటి?"

ప్రాథమికహక్కుల సంఘమునకు అధ్యక్షుడుగానుండిన వల్లభాయిపటేలు ఈ హక్కులు ప్రాథమికహక్కులుగా భావించెననియు, న్యాయనిబద్ధమైన ప్రాథమిక హక్కులతోపాటు, న్యాయబద్ధము కాకపోయినను పరిపాలనలో అతి ముఖ్యముగా గణించవలసిన సూత్రములుకూడా చేర్చవలెనని పటేలు చెప్పెననియు, ఈ సూత్రములను ఆయన "ప్రాథమిక పరిపాలనా సూత్రములు" అని నిర్వచించెనని కామత్ చెప్పి, డా॥ అంబేద్కరుగారును, ముసాయిదా నిర్మాణ సంఘమువారును ఇది తోసివేసి వీనికి పరిపాలనా సూత్రములని ఏల పేరుపెట్టిరని అడిగెను.

రెండు సవరణలనూ ప్రతిఘటించుచు అనంతశయనం అయ్యంగారు, పరిపాలనా సూత్రములను ఏ న్యాయస్థానము కూడా అమలు జరిపించలేదనియు, ఉదాహరణకు 10 సంవత్సరముల కాలములో ప్రభుత్వము నిర్బంధ విద్యావిధానము అమలు జరుపలేనిచో అట్లుచేయించుట ఏ న్యాయస్థానమునకు సాధ్యముకాదనియు, అందుచేత ఈ సూత్రములు న్యాయబద్ధము కాజాలవనియు చెప్పెను.

ఈ అధ్యాయమంతయు లోపభూయిష్టమేననియు, డా॥ అంబేద్కరే చెప్పినట్లు ఇందులో కేవల రాజకీయాదర్శములకు తావులేదనియు, అందుచే న్యాయబద్ధములు కాజాలని సూత్రము లిందులో నుంచనేకూడదనియు నాజిరుద్దీన్ అహమ్మద్ చెప్పెను.

రెండు సవరణలను ఖండించుచు డా॥ అంబేద్కరు "సూచక" అనుపదము ఉండదగుననియు భావిశాసకులు ఏవిధముగా పరిపాలన సాగించవలెనో ఇవి సూచించుననియు, ఈ సూత్రములు కేవలం అవస్యములు కావనియు, వీటిని భావిశాసకులు తప్పక అమలు జరుపవలెననియు చెప్పెను.

వోటుకుపెట్టగా కరీముద్దీను సవరణ వీగిపోయెను. కామత్ తన సవరణను ఉపసంహరించుకొనెను.

నజీరుద్దీన్ అహ్మద్ గారు పదవిషయకమైన సవరణ ప్రతిపాదించగా వీగిపోయినది. పరిషత్తు 28 వ అంశాన్ని ఆమోదించినది.

## ప్రభుత్వానికి తప్పనిసరి కావలెను

అనంతరం ప్రొ॥ కె. టి. షాగారు 29 వ అంశంలో ఒక సవరణను ప్రతిపాదించిరి. ఈ అధ్యాయంలో చేయబడిన సూచనలను ప్రభుత్వానికి తప్పని సరిఅగునట్లు చేయవలెనని ఆయన ప్రతిపాదించెను.

"ఈ సూత్రములను ఏ న్యాయ స్థానమూ అమలు జరుపలేదు అని నిర్ణయించటంవలన 29వ అంశం మొత్తం రాజ్యాంగాన్నే అవమానిస్తున్నది. ఈ అధ్యాయం మొత్తం రాజ్యాంగ మంతటిలోనూ చాల ప్రధానమూ, నిర్మాణాత్మకమూ అయినటువంటిది. ఎంతో కాలం నుంచి పరపీడనానికి గురి-అయిన ప్రజల ఆశయాలకూ, ఆశలకూ, కోరికలకూ అధికారరీత్యా సక్రమ రూపం ఇచ్చే అంశం ఇదొకటే. న్యాయ స్థానాలు ఈ ఆశలను ప్రతిఫలించే సూత్రాలను అమలు జరపలేవనటం సత్యంగాలేదు. వీటిని అనుసరించవలెనని ప్రభుత్వమును నిర్బంధించు అంశం ఒక్కటి కూడ ఇందులో చేర్చబడలేదు. ప్రభుత్వానికి ఆ బాధ్యతను ఏర్పరస్తూ రాజ్యాంగంలో విధించక పోయినట్లయితే కొన్నేళ్లకొకసారి జరిగే ఎన్నికలు మాత్రమే ప్రభుత్వాల చేత బాధ్యతా నిర్వహణం చేయించ గలవని అనుకుంటే, అంతకన్నా పెద్ద పొరపాటు మరొకటి ఉండదు. ప్రతి పౌరుడూ ఈ సూత్రముల నమలు పరచవలసిన దని ప్రభుత్వాన్ని నిర్బంధించే అధికారం కలిగి ఉండవలెను."

ప్రొ॥ షిబ్బన్లాల్ శాక్సేనాగారు, ఈ సూత్రములను 10 సం॥ల అనంతరం ప్రాథమిక సూత్రాలుగా చేయవలెనన్న సవరణను ప్రతి పాదించ వలెననుకుని కూడా మాని వేసిరి. షాగారి సవరణవీగి పోయి 29 వ అంశం పరిషత్తుచే ఆమోదించ బడినది.

## సాంఘికవ్యవస్థ

పరిషత్తు 30 వ అంశాన్ని ఆమోదించుటకు ముందు తీవ్రమైన చర్చ జరిగినది. పరిషత్తులోని ఏకైక సోషలిస్టు సభ్యుడు దామోదర స్వరూప్, "జాతీయ జీవితంలో అంతటా సాంఘిక, రాజకీయ న్యాయమును కలిగించే సాంఘికవ్యవస్థను ఏర్పరచటం ద్వారా ప్రభుత్వం ప్రజల శ్రేయోభివృద్ధికి తోడ్పడుటకు సాధ్యమైనంతవరకూ ప్రయత్నించవలెను" అన్న ఈ అంశంలో మార్పుచేసి "ప్రజలశ్రేయోభివృద్ధికై డెమోక్రటిక్ సోషలిస్టు వ్యవస్థను నెలకొల్పి నిర్వహించ వలెను" అన్న వాక్యాన్ని ప్రతిపాదించెను. దీనిని సాధించుటకై ఆయన గనులు మొదలైనవాటిని జాతీయం చేయటం, ప్రజావసర కార్య నిర్వహణ సంస్థలను జాతీయం చేయుటం, వ్యవసాయ సహకార సంస్థలను నెలకొల్పటం అన్న సూచనలను చేసెను. మోహన్లాల్ గౌతమ్ గారి సవరణ ఇదే విధముగా ఉండుటచే ఆయన దానిని ప్రతిపాదించలేదు. ప్రభుత్వం శ్రేయోభివృద్ధిని తప్పని సరిగా సాధించునట్లు చేయుటకై 'ప్రయత్నించవలెను' అన్న పదాన్ని తొలగించవలెనని నజీరుద్దీన్ అహ్మద్ గారు ప్రతిపాదించిరి. ఈ సవరణలు రెండు వీగిపోయి పరిషత్తు 30 వ అంశమునే ఆమోదించెను.

దామోదర స్వరూప్ గారు తన సవరణను సమర్థిస్తూ 'సోషలిస్టు వ్యవస్థ లేనిది నిజమైన ప్రజాస్వామ్యం ఏర్పడదనీ, దానిని నెలకొల్ప కుండా ప్రజాస్వామ్యాన్ని గురించి మాట్లాడటం కేవలం పేరును వల్లించటమే' నని అన్నారు. మహబూబ్ అలీబేగ్ గారు అసలు అంశాన్నీ, దామోదర్ స్వరూప్ సవరణనూ, రెంటినీ ప్రతిఘటిస్తూ, ఈ రెండూ రాజకీయ పార్టీల కార్యక్రమాలవలె ఉన్నవనీ, ప్రభుత్వ పార్టీలు మారే అవకాశం గల ప్రజాస్వామిక రాజ్యాంగంలో పార్టీ కార్యక్రమాలకు తావు ఉండకూడదనీ అన్నారు. హనుమంతయ్యగారు బేగ్ గారిని ప్రతిఘటిస్తూ, సోషలిస్టు సిద్ధాంతాలు ప్రపంచ మంతటిచేతనూ ఆమోదింపబడినవనీ, ఆ సిద్ధాంతాలను అన్వయించేట్లుగామాత్రమే ఈఅంశం చెప్పబడినదనీ,ఏపార్టీ ప్రభుత్వం వచ్చినా ఈ అంశంవలన ఆటంకంకలగదనీ అన్నారు.

## పరిషత్తులో పార్టీలప్రాబల్యం

హుసేన్ ఇమాంగారు మాట్లాడుతూ రాజ్యాంగపరిషత్తు నడుస్తున్న పద్ధతిని విమర్శించిరి.

"ప్రతిపాదనలను అధికారంలోవున్న పార్టీ చేస్తున్నది. పార్టీ విప్పు (నాయకులు)ల ఆజ్ఞల ననుసరించి అనేక సవరణలు ఆపివేయబడుతున్నవి. ఈ అంశంలో సోషలిస్టు సిద్ధాంతాలు ఇమిడివున్నవనటం సరికాదు. అదేకాక ఈ అధ్యాయంలో చెప్పబడిన సూత్రాలను ప్రభుత్వం ఉల్లంఘించకుండా చూచుటకు రాజ్యాంగంలో ఒక్క ఏర్పాటుకూడా లేదు. ఇటువంటి ఉల్లంఘనను నివారించటానికి ఆఖరికి రిపబ్లిక్ అధ్యక్షునికికూడా అధికారం ఇవ్వబడలేదు. ఉల్లంఘనం జరగకుండా చేసే ఏర్పాట్లు లేనప్పుడు ఇటువంటి సిద్ధాంతాలను ఏ కరువుపెట్టటం కేవలం ప్రతివాదులనోళ్ళను కట్టివేసి, 'ఇదుగో ఈ సూత్రాలన్నిటినీ మేము అనుసరింప ప్రయత్నిస్తున్నాము" అని ప్రకటించుకొనటానికిమాత్రమే ఉపయోగిస్తుంది."

ఉపాధ్యక్షుడు పరిషత్తులో పార్టీ ప్రమేయంలేదని చెప్పెను.

మహావీర్ త్యాగిగారీ క్రిందివిధంగా విమర్శించిరి: "ఉపోద్ఘాతంలో న్యాయం, స్వాతంత్ర్యం, సమానత్వము, సౌభ్రాతృత్వాలను నిర్వచిస్తామని చెప్పివున్నాం. కాని న్యాయానికి సంబంధించిన ఈ అంశంలో అనేక 'ఇరుకు' మాటలు ప్రవేశపెట్టబడినవి. 'ప్రయత్నించవలెను' 'సాధ్యమైనంతవరకు' మొదలైనమాటలు ప్రభుత్వం ముఖ్యసూత్రాలనే ఉల్లంఘించటానికి అవకాశం ఇవ్వగలవు. ప్రభుత్వం వాటిని నిర్వహించలేకపోతే బయటికి నడవవలసినదే. ప్రభుత్వం తమకు సేవచేయవలెననే ప్రజలు కోరుకుంటారు. కేవలం శాంతిభద్రతలనుమాత్రమే కాపాడే పోలీసు రాజ్యం కావలెనని వారు కోరటంలేదు."

## అంబేద్కర్ జవాబు

విమర్శలకు సమాధాన మిస్తూ డా॥ అంబేద్కర్ ఈక్రిందివిధంగా ప్రసంగించెను: "ఈ విమర్శలు చాలవరకు అపోహవలన కలిగినవి. ఈ రాజ్యాంగ పార్లమెంటరీ ప్రభుత్వానికి పునాదులువేస్తున్నది. ప్రతి ప్రభుత్వమూ తన అనుదిన వ్యవహారాల్లోనూ, చివరికి ఎన్నికలప్పుడూ విమర్శలకూ, ప్రజాభిప్రాయానికి అగి ఉండవలెను. మన మిప్పుడు రాజకీయ ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పి ఉన్నాము. అదేవిధంగా ఆర్థిక ప్రజాస్వామ్య స్థాపనకై ఒక వరవడిని ముందుపెట్టుకోవలెను. నా ఉద్దేశ్యంలో ఆర్థిక ప్రజాస్వామ్యమంటే 'ఒక్క మనిషికి ఒక్క విలువ" అని. దాని విషయమై మిగిలినవారికి భిన్నాభిప్రాయా లుండవచ్చును. దానిని సాధించుటలో అనేకులు అనేకమార్గాలను అనుసరించవచ్చును. అందువలన దీనికి ఒక ఖండిత మార్గాన్ని, మార్చుటానికి వీలులేకుండా, ఏర్పరచటం ఉచితంకాదు. కాబట్టి, మార్పులకువీలుగా ఈ అంశం, ఈ భాషలో నిర్వచించబడినది. 'ప్రయత్నించవలెను' మొదలైన మాటలను త్యాగిగారు ఆక్షేపించిరి. కాని ప్రతికూల పరిస్థితులలోకూడా ప్రభుత్వం వీటిని ఆచరణలో పెట్ట ప్రోత్సహించుటకే ఈ విధముగా నిర్వచించబడినది. ప్రయత్నించుట అన్నపదం లేకపోతే, పరిస్థితులు విరుద్ధంగా ఉన్నవి. కనుక ఆచరణలో పెట్టలేమని ప్రభుత్వం మొదటికే మోసం తేవచ్చునుకదా!"

సవరణలు తోసివేయబడి 30 వ అంశం ఆమోదించబడినది.

## మద్యపాన నిషేధం

మద్యము, ఇతర మత్తుపదార్థాలను నిషేధిస్తూ రాజ్యాంగములో ఒక నిబంధనను ఉంచవలెనని కాజీకరీముద్దీన్ గారు చేసిన ప్రతిపాదనపై చర్చ జరుగుతుండగా వేళ అయిపోయి సమావేశం రేపటికి వాయిదాపడినది. మహావీర్ త్యాగి, షిబ్బన్లాల్ శాక్సేనా, సెఠ్ గోవిందదాస్, మహమ్మద్ ఇస్మాయిల్, పోకర్ సాహెబ్ గార్లు ప్రతిపాదనను సమర్థించిరి. బిశ్వనాథదాస్ గారు ప్రతిఘటించిరి.

# రాజ్యాంగ పరిషత్తుకు సౌరాష్ట్ర ఎన్నికలు

## ముగ్గురు కాంగ్రెస్ అభ్యర్థుల ఓటమి

రాజకోట, నవంబరు 19 : సౌరాష్ట్ర సమాఖ్యనుండి భారత రాజ్యాంగ పరిషత్తుకు అభ్యర్థులను ఎన్నుకొనుటలో కొందరు కాంగ్రెస్ వాదుల ఓడిపోవుట తటస్థించినది. రెండు స్థానములలో స్వతంత్ర అభ్యర్థులు గెలిచిరి. వంకనేర్ యువరాజా కాంగ్రెస్ అభ్యర్థిని 8772 వోట్ల మెజారిటీతో ఓడించెను. గొండాల్ యువరాజా 1198 వోట్ల మెజారిటీతో గెలిచెను. మాలిసాయల నియోజకవర్గములో బాద్వాలి దర్బార్ సాహెబు కాంగ్రెస్ అభ్యర్థిని ఓడించెను. మొత్తము 35 స్థానములలో ఇప్పటికి 25 కాంగ్రెసు, 3 స్వతంత్ర అభ్యర్థులకు వచ్చినవి. ఇంక 7 స్థానముల ఎన్నికఫలితములు తేలవలెను.

# నగరంలో బస్సురేట్ల హెచ్చింపుపై విరామతీర్మానం

చెన్నపట్నం,నవంబరు 19 : నగరంలో బస్సురేట్ల హెచ్చింపు గూర్చి అబ్దుల్ లతీఫ్ ఫరూకీగారు కౌన్సిలులో ఒకవిరామ తీర్మానమునకు నోటీసిచ్చిరి. ఇది సోమవారము చర్చకు వచ్చును.అప్పుడు రవాణాశాఖమంత్రి గోపాలరెడ్డిగారు ప్రభుత్వవిధానం వివరించెదరని తెలిసినది.

రేట్లు హెచ్చించినందువల్ల ప్రభుత్వానికి రోజుకు రూ 1000/- లు అధికాదాయం రాగలదని అంచనా. మొదట్లో వారానికి 20 వేలు ఆదాయ మొచ్చేదని, ఇప్పుడు ధరలు హెచ్చించుటకు పూర్వమే, ఆ ఆదాయ మువారమునకు 157 వేలకు పెరిగినదని తెలియుచున్నది.

## ఆంధ్రమహిళల రాయబారం

ఆంధ్ర రాష్ట్రమహిళా సంఘం తరఫున శ్రీమతి మోటూరి ఉదయం, వి. అన్నపూర్ణదేవి, కె. హనుమాయమ్మ, తాడాలి నాగరత్నమ్మ జోశ్యభట్ల సుబ్బమ్మగార్లు నేడు ప్రధాన మంత్రి, న్యాయశాఖా మంత్రిగార్ల వద్దకు రాయబారం వెళ్లి, కమ్యూనిస్టు నిర్బంధితుల కుటుంబాలకు ప్రభుత్వం వారు అలవెన్సు లివ్వాలని కోరిరి.

## మహిళా హిందీ విద్యాలయం

ఎస్. ఆర్. శాస్త్రిగారు యిట్లు వ్రాయుచున్నారు.—— త్యాగరాయ నగరం హిందీ ప్రచార సభయందు కృష్ణ పాండేపాంవలె విద్యాలయ భవనము నందు మహిళా హిందీ విద్యాలయము 16వ తేదీ తెరువబడెను. అందు యింకను మరి కొందరిని చేర్చుకొనుటకు అవకాశం గలదు. "విశారద" పరీక్షకు 10 నెలలలో శిక్షణ ఒసంగ బడును. విద్య బస ఉచితంగా నిస్తురు. రాష్ట్ర భాష ప్యాసయి 8వ ఫారము వరకు చదివినవారు, నవంబరు 21 లోగా చేరవచ్చును.

## ఆడ బస్సు కండక్టర్లు

మదరాసు బస్సుసర్వీసు లందు కండక్టరులుగా నియమింప బడిన స్త్రీలకు 16 తేది సాయంకాలం వెంటనొక పాత కండక్టరు నిచ్చి బస్సులపై పని నేర్పించిరి. మైలాపూరు, మాంబళం బస్సు మార్గము లందు వీరిని 17 తేదీనుంచి నియమించిరి. ఎక్కువ ప్రెసు బస్సు లందు మాత్రం వీరు పనిచేయుచున్నారు.

## భారతీయ సంఘసేవా పరుల మహాసభ

చెన్నపట్నం నవంబరు 18 : భారతీయ సంఘసేవా పరుల మహాసభకు సభ్యులను చేర్చుకొనే తేదీ డిశం 1వ తేదీ వరకు పొడిగించుటకు నిశ్చయించి యున్నట్లు కార్యదర్శి తెలుపుచున్నాడు.

మదరాసు నూలు టోకు వ్యాపారస్తులు త్యాగరాయి నగరంలో సమావేశమయి, రా. సా., బి. పాపయ్యచెట్టి గారి అధ్యక్షతను ఒక ప్రత్యేక సంఘమును మదరాసు నూలు టోకు వ్యాపారస్తుల చేంబరును ఏర్పాటు చేసిరి. దీనికి సి. ఎతిరాజులుచెట్టిగారు కార్యదర్శిగ ఎన్నుకొన బడిరి.

# ఉద్యోగుల ప్రత్యేక వేతనము రద్దు

చెన్నపట్నం, నవంబరు 19: ఆర్థిక మంత్రి గోపాలరెడ్డి, ప్రధానకార్యదర్శి, ఆర్థిక కార్యదర్శి న్యాయశాఖ కార్యదర్శి గార్లు సమావేశమై ఉద్యోగుల ప్రత్యేక వేతనమునుగురించి చర్చించి దానిని రద్దు చేయుటకు తీర్మానించిరి. ఇండియా కార్యదర్శి పదవిపుండగా ఖరారునామాపై ఉద్యోగములో ప్రవేశించినవారికి, జిల్లా ఉద్యోగులకు ఈ నిర్ణయం వర్తించదు. సర్క్యూటు చేయ నక్కరలేని ఉద్యోగులకు, కార్యదర్శులవంటి వారికి, వాహన భత్యం క్రింద 10% 15% లకు మించకుండా ఇచ్చుటకు తీర్మానించిరి. ఇప్పుడు ప్రత్యేక వేతనంక్రింద కొందరికి రు 250/- వరకూ ముట్టుచున్నది.

## గంటల పంచాంగం

సర్వధారి సం॥ కార్తీక బ॥పంచమి 1948సం॥ నవంబరు 21 ఆదివారం

ఆ॥ పంచమి రా 7-32 పున ప 2-49 వర్జ్యం రా 10-27 ల 11-59 కు.

బ॥ షష్ఠి నవంబరు 22 సోమవారం సో॥షష్ఠి సా 5-47 పుష్య ప 1-46 వర్జ్యం రా 1-55 ల 3-27 కు.

ఆంధ్రపత్రిక

సర్వధారి సం॥ కార్తీక బ॥పంచమి ఆదివారం

# రాజ్యాంగ పరిషత్తు తక్షణ కర్తవ్యము

కామన్వెల్తులో భారత దేశ స్థానము, బ్రిటన్‌తో భారతదేశ సంబంధము నిర్ణయము కానంత వరకు రాజ్యాంగ ముసాయిదాపై పరిషత్తులో జరుగు చర్చలకు వాస్తవిక ధోరణి యేర్పడజాలదని గత పక్షము రోజులుగ సభ్యులు చేయుచున్న ప్రసంగములు; ప్రతిపాదించుచున్న సవరణలవలన స్పష్టమగుచున్నది. భారత దేశమునకు ఏ విధమైన రాజ్యాంగము యుక్తమను విషయమున అగ్ర నాయకులకైన ఏకాభిప్రాయము కుదురుట సాధ్యముగాదు. రాజ్యాంగమున రాజు లేనంత మాత్రమున రిపబ్లిక్ కాజాలదు; రిపబ్లిక్ అయినంత మాత్రమున ప్రజాస్వామికము కాజాలదు. కనుకనే భారత దేశము "సర్వాధికార సమన్విత స్వతంత్ర ప్రజాస్వామిక రిపబ్లిక్'' అని విస్పష్టముగ ప్రకటింపవలెనని ప్రొ॥ కె. టి. షా ప్రభృతులు హెచ్చరించి యుండిరి. కాని లక్ష్య నిర్వచన తీర్మానముపై చర్చ జరిగిన సందర్భమున పండిట్ జవహర్లాల్ నెహ్రూ 'రిపబ్లిక్' అన్న పదంలో ''ప్రజాస్వామికము'కూడ చేరియున్నదని వాదించిరి. అదే విధముగ రాజ్యాంగ రచనాసంఘ అధ్యక్షుడు డాక్టర్ అంబేడ్కర్ సర్వాధికార సమన్విత మన్నను, స్వతంత్ర మన్నను ఒక్కటే గనుక "స్వతంత్ర'' అను పదము అవసరములేదని సూచించిరి. అయితే పేరు 'రిపబ్లిక్'కు ముందు ''ప్రజాస్వామిక" అని చేర్చిరి. లక్ష్య నిర్వచన తీర్మానమునకును, రాజ్యాంగ ముసాయిదాకును ప్రధాన విషయముననే ఇంతటి వ్యత్యాస ముండుటకు బ్రిటన్, బ్రిటిషు కామన్వెల్తులతో భారత దేశ సంబంధములు ఎట్లుండవలెనన్నది నిర్ణయము కాకపోవుటే కనుకనే పరిషత్తు సభ్యులు శత సహస్రముగ సవరణలు ప్రతిపాదించుట, సవరణల చర్చపై వృథా కాలయాపన జరుగుట అనివార్యమైనది.

''యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్స్'' నందు సోషలిస్టు రిపబ్లిక్ కానట్టి రాజ్యములకు స్థానము ఉండుటకు వీలు లేనట్లే బ్రిటిషు కామన్వెల్తునందు"సర్వాధికార సమన్విత స్వతంత్ర ప్రజాస్వామిక రిపబ్లిక్'' లకు స్థానము ఉండదు. ఐర్లెండ్ విదేశ సంబంధముల శాసనమును రద్దుచేయుటతో బ్రిటిషు కామన్వెల్తునభ్యత్వమును కోల్పోయినదన్న, ఈ వాదమే బలపడుచున్నది. బ్రిటిషు కామన్వెల్తునందుండి తన 'ఫాసిస్టు'విధానమును అమలుజరుపుట సాధ్యము గాదని విశ్వసించి దక్షిణాఫ్రికా యూనియను ప్రధాన మంత్రి డా॥ మలాన్ "యూనియన్ ఆఫ్ సౌత్ ఆఫ్రికా''ను ''రిపబ్లిక్ ఆఫ్ సౌత్ ఆఫ్రికా"గా మార్పుచేయుట కాలోచించుట కూడ ఇట్టి యభిప్రాయమునకు దోహదము చేయుచున్నది. కనుకనే అంబేడ్కర్ గారు రిపబ్లిక్‌కు ముందు 'డెమోక్రాటిక్' అని చేర్చుట జరిగెను.

రాజ్యాంగ ముసాయిదాను తయారుచేసినవారు భారతదేశము కామన్వెల్తులో ఉండునని, ఉండవలెనని భావించి, అందుకు తగినట్లుగ 'స్వతంత్ర' భారతరాజ్యాంగమును తయారు చేసిరి. భారత దేశము కామన్వెల్తునందుండరాదని, పరిషత్తు భారతదేశ పరిస్థితులకు, అవసరములకు తగినట్టి రాజ్యాంగమునే తయారుచేయవలెనని సభ్యులలో పలువురు అభిప్రాయ పడుచున్నట్లు సవరణల జాబితాను పరిశీలించిన స్పష్టమగును. వీరు ముసాయిదాయందలి ప్రతి ఒక్క విషయమును, ప్రతి ఒక్క క్లాజును ఇంతవరకు ఆదృష్టితోనే విమర్శించుచుండిరి. భారత ప్రభుత్వ వైఖరిగాని, రాజ్యాంగ పరిషత్తు వైఖరిగాని స్పష్టము కానంతవరకు వీరీ విధముగ విమర్శించు చుందురు. అట్టిపరిస్థితులలో వీరీ విధముగ విమర్శించుట సహజమే. కనుక రాజ్యాంగ పరిషత్తు ఇతరకార్యక్రమమును నిలిపి అయినను ఈ ప్రధాన విషయమున ఒక నిర్ణయము చేయుట అవసరము. అట్లుజరిగిన సభ్యుల కేర్పడిన అపోహలు, సందేహములు తొలగిపోయి రాజ్యాంగ ముసాయిదాను త్వరగ శాసనముచేయ వీలగును.

ఈ నిర్ణయము చేయు సందర్భములో భారత ప్రభుత్వము రాజ్యాంగ పరిషత్తు సభ్యులు ఒక ప్రధాన విషయమును గుర్తుంచుకొనవలసి యుండును. కామన్వెల్తునందు వివిధ "అధినివేశములకు" సమానాధికారము, ఒకే స్థాయి ఉన్నను, అన్ని అధినివేశములందును, కామన్వెల్తు పౌరులందరికి సమాన, ప్రాథమిక పౌరహక్కులు లేవు. ఈ సమస్య ఆస్ట్రేలియా, కెనడా, న్యూజిలాండ్ వంటి శ్వేత అధినివేశములకు అంత ప్రధానము కాదు, కాని భారతదేశమునకు అత్యంత ప్రధానమైనది. కామన్వెల్తునుండి పూర్తిగ వైదొలగిన ఐర్లెండ్ పౌరులకు ఉన్నంత మాత్రపు హక్కులైనను, బ్రిటిషు అధినివేశముగ నుంటున్న భారత దేశ పౌరులకు లేకుండెను. అట్టి విచక్షణ, తారతమ్యములుఅంతరించినగాని కామన్వెల్తు సభ్యత్వము, కామన్వెల్తు పౌరసత్వమునకు అర్థముండదు. కనుకనే అమెరికన్ మితవాద పత్రిక నేషన్ "దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియాలలో భారతీయులకు జరుగుచున్న అన్యాయము అంతమైనగాని ప్రాక్పశ్చిమ సామరస్య సాధనకు కామన్వెల్తు ప్రయోజనకర మగు పరికరము కాజాలదు" అని హెచ్చరించెను. భారతదేశము బ్రిటిషు కామన్వెల్తులో నుండ కోరువారు ఈ "అన్యాయము అంతము'' చేయుటకు ప్రయత్నింపవలెను.

భారతదేశము కామన్వెల్తునందుండుటవలన ప్రయోజనములు, ప్రమాదములు కూడ నున్నవి. ఈ విషయమును భారత ప్రధానామాత్యుడు గుర్తింపక పోలేదు. కాని బర్మా, ఐర్లెండువంటి చిన్న దేశములే స్వతంత్రప్రజాస్వామిక రిపబ్లిక్‌లుగ నుండకలిగినపుడు భారతదేశము "సర్వాధికార సమన్విత స్వతంత్ర ప్రజాస్వామిక రిపబ్లిక్"గ నుండుటకు గల అభ్యంతరములుగాని, ప్రతిబంధకములుగాని ఏమియు ఉండజాలవు. భారత స్వాతంత్ర్యపోరాటమున ఐర్లెండు కొంతవరకు మార్గదర్శకమైయున్నందున, ప్రస్తుతముకూడ భారతీయులు ఐర్లెండు చర్యలను అతిశ్రద్ధగ పరిశీలించుట సహజం.

ఆస్ట్రేలియా ప్రధాని ఛిఫ్లే మొన్నటిదినము పార్లమెంటులో ప్రకటించిన వివరములను బట్టి భారతదేశము ఐర్లెండుమార్గమునే అనుసరించినప్పటికిని, కామన్వెల్తు రాజ్యములకు ఆఫ్రికా, ఐర్లెండు, భారతదేశములకు సంబంధము ఉండునట్లు ఒక ఏర్పాటుకు ఇతర కామన్వెల్తు రాజ్యములు సుముఖముగ నున్నట్లు విదితమగుచున్నది. ఇంచుమించు ఇదే ధోరణిలో లండను సమావేశమునకు కెనడా ప్రతినిధిగ హాజరైన లారెంట్ ఇదివరకు ప్రకటించియుండెను.

కనుక భారతరాజ్యాంగ పరిషత్తు, భారతప్రభుత్వము కూడ, ఈప్రధానసమస్యపై నిర్ణయమును అనవసరముగ వాయిదావేయక, వెంటనే చేయుట వాంఛనీయము; అవసరము. అప్పుడు సభ్యులు స్వతంత్ర భారత రాజ్యాంగమునువాస్తవికదృష్టితో పరిశీలించి, అనవసరమగు సవరణల ప్రతిపాదింపక రాజ్యాంగ ముసాయిదా సత్వరామోదమునకు తోడ్పడగలరు. అందువలన జయపూర్ కాంగ్రెస్ మహాసభకూడ ఈ నిర్ణయముపై తన ఆమోదమును తెల్పుటకు వీలగును.

## ఐక్యరాజ్యసమితిలో "ప్రపంచ పౌరుని" గలభా

పారిస్, నవంబరు 19: పెలైడిషైలో భవనంలో నేడు ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీ సమావేశం అవుతుండగా, గారీ డేవిస్ అనే ప్రపంచ పౌరుడు ప్రేక్షక స్థానములలో నుండి గబుక్కున లేచి నుంచుని పెద్దగా ఉపన్యాసం చేయుటకు మొదలు పెట్టెను. అసెంబ్లీ అధ్యక్షుడు డా॥ హెర్బర్టు ఇవాట్ సరిగా అంతకుముందే సమావేశమును అరగంటసేపు వాయిదా వేయుటకు నిశ్చయించితినని ప్రకటించెను. డేవిస్ తానుకూర్చున్న కుర్చీలోంచి ఎగిరి నుంచొని ఇలా గొంతు చించుకుంటూ అరిచాడు:-" ప్రపంచ ప్రజలమైన మాకు ఈ వేదికమీద ఉపన్యసించే హక్కు ఉన్నది." అతని నోటి నుండి పట్టుమని పదిమాటలైనా వెలువడక మునుపే పోలీసులు అతనిమీద పడి నోరు నొక్కి వైటికి ఈడ్చుకొని పోయినారు. పారిస్‌లో ఐక్యరాజ్యసమితి సమావేశాన్ని భగ్నపరచడానికి ప్రయత్నం జరగడం ఇదే ప్రథమ పర్యాయం.

పోలీసులు గారీడేవిస్‌ను లాగుకొని వెళ్తుండగా, అతని అనుయాయులు పోలీసులమీద కలియబడిరి; ఇరుపైపుల వారికి కొంతసేపు ముష్టియుద్ధం జరిగింది. దరిమిలాను పోలీసులు డేవిస్ అనుయాయులలో అయిదుగుర్ని అరెస్టుచేసిరి. కాని వారిలో ఒకరు ప్రపంచ ప్రభుత్వంగురించి తాను వ్రాసికంఠో పాఠం చేసిన ఒక ఉపన్యాసాన్ని సాంతం అప్పజెప్పిన తరువాతగాని పోలీసులకు లొంగిరాలేదు. డేవిస్‌ను అతని అనుయాయులను పోలీసులు పెలైడిషైలో భవనంలో ఉన్న రాణావు తీసుకొని వెళ్లిరి. పెలైడిషైలో భవనం "అంతర్జాతీయ ప్రదేశం" అయి ఉన్నందున తనకు అక్కడ పరిమితాధికారంమాత్రమే ఉన్నదనీ, డేవిస్‌ను అతని అనుయాయులను కొన్ని ప్రశ్నలు అడిగినతర్వాత విడిచిపెట్టడం అవుతుందనీ పోలీసుకార్యాలయ అధిపతి చెప్పెను.

## మత్తుమందుల వ్యాపారం నిగ్రహించడానికి అంతర్జాతీయ ఒడంబడిక

పారిస్, నవంబరు 19: మత్తు మందుల వ్యాపారమును నిగ్రహించుటకై ఐక్యరాజ్యసమితి తయారుచేసిన ఒడంబడిక మీద ఇండియా తరపున శ్రీమతి విజయలక్ష్మి పండిట్ నేడిక్కడ సంతకము చేసెను. అంతర్జాతీయ ఒడంబడికలమీద ఇండియా ప్రతినిధి స్వంతలిపిలో దస్కతు చేయుటకు ఇదే ప్రథమం; అందులోనూ ఒక స్త్రీ ప్రాతినిధ్యం వహించడం ఇంకా విశేషం.

# జలప్రభ జలప్రవేశోత్సవం

## సర్దార్ పటేల్ ఆశీర్వాదం

విశాఖపట్టణం, నవంబర్ 20: నేడు విశాఖపట్టణ రేవులో సింధియా స్టీమ్ నావిగేషన్ కంపెనీవారు నిర్మించిన రెండవనౌక "జలప్రభ" జల ప్రవేశ మహోత్సవము జరిగెను. భారతఉపప్రధాని సర్దారు పటేలు ఆరోగ్య కారణములచేరాజాలనందున ఢిల్లీ నుండియే ఆశీస్సులు రేడియో ప్రసారము చేయబడెను.

తాము స్వయముగా ఉత్సవములో పాల్గొనజాలక పోయినందుకు విచారము తెలుపుచు సర్దారు పటేలు సింధియా కంపెనీ వారు పడిన కష్టములను సురించియు వారు సాధించిన విజయములను గురించియు చెప్పెను.

"మనము స్వాతంత్ర్యము కొరకు పోరుచున్న సమయములో వారును విజయము కొరకు పోరి, మన వలెనే వారునూ అవాంతరముల నెదుర్కొనిరి. మనతో పాటే వారికిని విజయము చేకూరినది. మనతోనే వారుకూడా నిర్మాణ కార్యక్రమములో ప్రవేశించిరి. ఒక సంవత్సరము క్రితమే మనము స్వతంత్ర రాజ్యాంగము నడపనారంభించితిమి. సంవత్సరము క్రితమే వారు తాము నిర్మించిన మొదటి ఓడ ("జలఉష")ను జలప్రవేశ మొనర్చిరి. ఈ కార్యమును భారత ప్రధాని జరిపించియుండెను. నాకు సింధియా వారితోను భాయీవాల్చంద్ హీరాచందుతోనూ ఆవాదిగా స్నేహము న్నది. వారి చరిత్ర అంతయు నే నెరుగుదును, అని సర్దారుపటేలు చెప్పెను. సింధియావారి యోగక్షేమములు భారతదేశ యోగక్షేమములతో పెనవేసుకొని యున్నవనియు మనము మన కాళ్ళమీద నిలబడువరకును వారి సహకారము మన కవసరమనియు, నౌకానిర్మాణము భారీకీలక పరిశ్రమ కనుక అది కాలక్రమమున ప్రభుత్వపరమగుననియు, మనకు ఈ పరిశ్రమ ఎంతవరకు అవసరమో అంతవరకును దానిని సంరక్షించుకొనవలెననియు ఆయన చెప్పెను.

శ్రామికులను గురించి చెప్పుచు సర్దారు పటేలు, మనము సాధించిన స్వాతంత్ర్యములో వారికి పాలులేక పోవుట శోచనీయమనియు,... ఆ కారణముచేత వారు దేశమున కభ్యుదయకరమైన పరిశ్రమల సౌభాగ్యమునకు అంతరాయములు కల్పించి చీటికి మాటికి సమ్మెలు చేయరాదనియు చెప్పెను.

"జలప్రభ ప్రపంచములో ఎన్ని పట్టణములకు పోయిన అన్ని పట్టణములలోనూ భారతీయుల గౌరవమును, భారతజెండా ఖ్యాతియు ఇనుమడింప జేయునుగాక! ఈ నౌకయు సింధియావారు తయారు చేయు ఇతర నౌకలునూ భారతీయుల కీర్తిని ప్రపంచమంతటా చాటవలెనని భగవంతుని ప్రార్థించుచున్నాను," అని సర్దారు పటేలు ఆశీర్వదించెను.

నౌకకు పూజమాత్రమే జరిగెను. సముద్రమున పోటు తీయుటచే జలప్రవేశము జరుగలేదు. అది తరువాత జరుగగలదు.

## ఢిల్లీలో ఉత్సవము

న్యూఢిల్లీ, నవంబరు 20: అనుకొన్న దానికి ఒక గంట ఆలస్యముగా గం 10-45 లకు "జలప్రభ" జలప్రవేశము చేసెను. న్యూఢిల్లీలోని ఇర్విన్ థియేటరులో సర్దారు పటేలు రేడియామీట నొక్కగా "జలప్రభ" జలప్రవేశము చేయు సమయమున అచ్చట గవర్నరుజనరలు రాజగోపాలాచారి, రక్షణమంత్రి బలదేవసింగు, ఇతర మంత్రులు, డా॥ పట్టాభి, నౌకాశాఖోద్యోగులు మొదలైనవారుండిరి. రేడియో సంకేతము చూడగానే సర్దారు పటేలు మనుమడు విపిన్ దయాభాయ్ పటేలు కొబ్బరికాయ కొట్టెను.

## చకస్లవేకియాకు భారత రాయబారి పయనం

బొంబాయి, నవంబరు 10: చకస్లవేకియాలో భారత రాయబారిగా నియోగింపబడిన యన్. రాఘవన్, కుటుంబ సమేతముగా, సిబ్బందితో కలసి, ప్రత్యేక విమానములో, బొంబాయినుండి సోమవారం నాడు ఉదయం 5-30 గంటలకు లండన్‌కు బయలుదేరివెళ్ళును. లండన్‌లో రెండురోజులుండి పిదప రాఘవన్. పరివారములో నవంబరు 26 కల్లా చకస్లవేకియా రాజధాని ప్రాగ్ చేరుకొనును.

## అమెరికా రాయబారి యోగ్యతాపత్ర సమర్పణ

న్యూఢిల్లీ, నవంబర్ 19: అమెరికా రాయబారి లాయ్ హెండర్సన్, తన రాయబారి యోగ్యతా పత్రములను నేడు లాంఛనప్రాయముగా, భారత గవర్నర్ జనరల్‌కు సమర్పించుకొనెను. భారత విదేశాంగశాఖా సహాయకార్యదర్శి పి. ఎ. మీనన్, అమెరికన్ రాయబారిని గవర్నర్ జనరల్ కడకు కొనివచ్చెను.

రాయబారికి, ఆయన సిబ్బందికి పరివారమునకు, విందొసంగబడెను.

# బెర్లిన్ సమస్యా పరిష్కారం

## భద్రతా మండలి అధ్యక్షుని ఆశాభావం

పారిస్, నవంబర్ 20: బెర్లిన్ సమస్య పరిష్కారం కాగలదనే దృఢనమ్మకం తనకున్నదని, భద్రతా మండలి అధ్యక్షుడు డా॥జువాన్ బ్రా ముగ్లియోయీరోజ్ ఐక్యరాజ్యసమితి రేడియోద్వారా బ్రాడ్‌కాస్టు ప్రసంగంలో వెల్లడించెను. బెర్లిన్ విషయమై రష్యాకు పశ్చిమ రాజ్యములకు యేర్పడిన తగాదాపరిష్కారప్రయత్నంలో ప్రముఖ పాత్ర వహించిన బ్రా ముగ్లియా, "బెర్లిన్ తగాదా పరిష్కారమునకై లోగడ ఆరు తటస్థ రాజ్యములు సంప్రదింపులద్వారా చేసిన ప్రయత్నమును బట్టి, పరిష్కారం సాధ్యమేనని తేలినది. అయితే ఈ ఆరురాజ్యములు, తమ సంప్రతింపులు గతించి పోకుండా చూడవలెను, పరిష్కారమునకు యిప్పుడున్న అవకాశములు జారిపోకుండా ఉండవలెను. మధ్యేమార్గమునకు అన్వేషణ తీవ్రతరం కావలెను. ఉభయపక్షముల ఆత్మగౌరవమునకు భంగం లేకుండా, బెర్లిన్ దిగ్బంధనను తొలగించుటకు నగరంలో ఒక కరెన్సీ చలామణికి, పరిష్కారం కుదురవలెను." అని బ్రాముగ్లియా అనెను.

## చైనాప్రభుత్వ సేనల ఎదురుదాడి

(1-వ పేజీతరువాయి)

రైలుమార్గముల వెంబడి తమ తమ పల్లె నివాసములకు వెడుతున్నారు.

టీన్‌స్టిన్‌లో మరియొక విమానాశ్రయం కట్టుటకు ప్రభుత్వంచేసే యోచనను బట్టి ఉత్తర చైనాలో టీన్‌స్టిన్ కట్టకడపటి రక్షణ స్థావరముగా చేయవలెనని లోగడ జనరల్ ఫూట్సోయా చేసిన ప్రకటనలు ధృవపడుతున్నవని రాయిటర్ విలేఖరి తెలుపుచున్నాడు.

కమ్యూనిస్టుసేనలు, తూర్పు హోపే రాష్ట్రమునుంచి, పీపింగ్, ముక్డెన్ రైలు మార్గమునకు ఉత్తరముగానున్న త్రోవ వెంబడి, పశ్చిమాభిముఖంగా సాగిపోవుచున్నట్లు టీన్‌స్టిన్ వార్తలవల్ల తెలియుచున్నది; ఉత్తరచైనా కోస్తా ప్రాంతమునకు కీలకమైన టాకూ ప్రాంతములో ప్రభుత్వసేనలరక్షణలు బలపరచ బడుచున్నవి.

చైనా రాజధానినుంచి ఆస్ట్రేలియన్ పౌరులను ఖాళీచేయించుటకు ప్రభుత్వం సంకల్పించినదని, ఆస్ట్రేలియా ప్రధాని నేడు వెల్లడించెను.

## హుచే యుద్ధవిజేతకు చాంగ్ పారితోషికం

సుచేకు తూర్పు పార్శ్వమున కమ్యూనిస్టుసేనలను ఓడించిన, ప్రభుత్వసేనాని జనరల్ చియాంచింగ్ యూఆన్‌కు, జనరలిజ్మో చాంగ్ కైషేక్, "నీలాకాశ" "ధవళమార్తాండ" మెడల్స్‌ను, 2 లక్షల బంగారు యూఆన్‌లను బహూకరించెను. యుద్ధంలో పాల్గొనే ప్రభుత్వోద్యోగులందరికీ, 10 లక్షల బంగారు యూఆన్‌లను పారితోషికముగా, జనరల్ లియాషిన్ ప్రత్యేకించెను. సుచేయుద్ధంలో, మొత్తం 2 లక్షల కమ్యూనిస్టుసేన నష్టపడినదని, చైనీస్ కేంద్రఅధికార వార్తాసంస్థ, అధికార అంచాల ఉదహరించెను.

నాన్‌కింగ్, హాంగ్‌కోలపై దండయాత్రకు కమ్యూనిస్టుల ప్రయత్నం భగ్నమైపోయిందని, యీవార్తాసంస్థ అనెను. సుచే పోరాటంలో మొత్తం 5 లక్షలసేన పాల్గొన్నవట.

## చైనాపట్ల ట్రూమన్ వైఖరి

వాషింగ్టన్, నవంబర్ 19: చైనాకు యితోధికసహాయము చేయవలసినదిగా నేడు జనరలిజ్మో చాంగ్ కైషేక్ పంపినవిజ్ఞప్తికి, ట్రూమన్ అధ్యక్షుడు బహు జాగ్రత్తగా సమాధాన మొసంగెనని తనసమాధానములో యెట్టి ఒప్పందమును పైన వేసుకోలేదని, అధికారరీత్యా తెలియుచున్నది. చైనా ప్రతిష్టంభన విషయమై వచ్చేవారం జార్జిమార్షల్‌తో సంభాషించిన అనంతరం, అమెరికా ప్రభుత్వ విధానమును వివరించుచూ ట్రూమన్ చేసే ప్రకటనలో అయననైఖరి తెల్లముకావచ్చు.

చైనా ప్రభుత్వసేనలకు పెద్దయెత్తున సహాయముచేయు 'యే కార్యక్రమమునకు ప్రస్తుతం ట్రూమన్ అంగీకరించ సిద్ధముగా లేనట్లు, అధికార వర్గములద్వారా తెలియుచున్నది.

కొందరు కాంగ్రెస్‌సభ్యుల వత్తిడివల్ల, చైనావిషయమై అమెరికా విధానమును వివరించుచూ అధ్యక్షుడు త్వరలోఒకప్రకటన చేయవలసి రావచ్చును.

అయితే యీ ప్రకటనలో చైనాప్రభుత్వంయెడ అమెరికా తోడ్పాటును పునరుద్ఘాటించవచ్చునేగాని పెద్ద ఒప్పందమునకు దేనికి లోనుగాదని అనుకొనుచున్నారు.

# రాబడి పన్ను దర్యాప్తు సంఘమునకు విస్తృతాధికారా

## గవర్నర్‌జనరల్ క్రొత్త ఆర్డినెన్సు

న్యూఢిల్లీ, నవంబర్ 19: 1947 రాబడి పన్ను దర్యాప్తు శాసనమును సవరిస్తూ గవర్నర్ జనరల్ నేడొక క్రొత్త ఆర్డినెన్సును ప్రకటించిరి. ఈ ఆర్డినెన్సు వల్ల దర్యాప్తు సంఘమునకు ఏవ్యాజ్యమునుంచి యైనను, యెట్టి భోగట్టా కావలసినను, స్వీకరించుటకు విస్తృతాధికారాలొసంగబడినవి.

సక్రమమైన పద్ధతిలో పన్నుకట్టుకుమని అంగీకరించిన పక్షమున, ఏవ్యక్తి పైనపైనను ప్రభుత్వము పెట్టిన కేసును ఉపసంహరించుకొనుటకు ప్రభుత్వమునకు అధికార మొసంగబడినది. దీని వలన రాజీకి వీలగు చాల సందర్భములలో తుదివరకూ కోర్టు వ్యవహారము నడప వలసినఅవసరము తీరును.

## ఆయుధ విసర్జన సమస్య

(1-వ పేజీ తరువాయి)

డిప్యూటీ విదేశాంగమంత్రి ఆండ్రీ విషనిస్కీ ఆరోపించెను.

పశ్చిమరాజ్యముల పథకం గురించి మాట్లాడుచూ, అటంబాంబు నిషేధం విషయంలో, పశ్చిమరాజ్యముల పథకం ఒక్క అడుగైనా ముందుకు వేయలేదని, ఆయుధ విసర్జనతోపాటే అటంబాంబు నిషేధం గూడా ఆలోచించవలసివున్నదని, విషనిస్కీ అనెను.

పశ్చిమ యూరప్ రక్షణ పథకం కేవలం, సోవియట్ రష్యాపై దాడికి ఉద్దేశింపబడినదేనని, బ్రిటన్ అమెరికాలు, ఆంగ్లో-అమెరికన్ కూటమిలోని యితర రాజ్యములు, విసుగువిరామం లేకుండా, వెర్రియెత్తినట్లు, ఆయుధ నిర్మాణం సాగించుచున్నవని, విషనిస్కీ ఆరోపించెను.

పశ్చిమరాజ్యముల పథకం, "అసలు ప్రధానమైన అటంబాంబు నిషేధనమస్య జోలికే పోలేదు. అంతర్జాతీయ కంట్రోలు సంఘమును చాటుగాపెట్టుకొని, ఐక్యరాజ్యసమితిలో తనకున్న మెజారిటీ అండగా, మానవాభ్యుదయ కార్యక్రమమునకు గూడా అణుశక్తి అందకుండా చేయుటకు అమెరికా ప్రయత్నించుచున్నది." అని సోవియట్ ప్రతినిధి విమర్శించెను.

ఆయుధవిసర్జనకు సంబంధించిన సోవియట్ పథకం, నిరుపయోగమైన ప్రచారంతోటి, దుష్టసంకల్పంతోటి కూడుకున్నదని బ్రిటిష్ ప్రతినిధి హెక్టర్ మెక్నీల్ విమర్శించెను. ఆయుధ విసర్జనోద్యమమునకు ఆదిలోనే హంసపాదుగ లె తయారు కావద్దని సోవియట్ రష్యాకు మెక్నీల్ విజ్ఞప్తిచేసెను.

ఆత్మరక్షణకలాపములలో నున్న లోటుపాట్ల సర్దుబాటుచేసుకొనుట వినా బ్రిటన్‌కు వేరే గత్యంతరం లేకున్నదని, ఈవిషయంలో, పూర్వంనుంచి తనతో మైత్రిగలిగివున్న ప్రజాస్వామ్య రాజ్యములతో, బ్రిటన్ సహకరించుచున్నదని, బ్రిటన్ తన మిలిటరీ శక్తిని కనిష్ట ప్రమాణం వరకు తగ్గించుకొన్నదని, ఆయుధసంపత్తిని యికే మాత్రమూ తగ్గించుకోలేదని, బ్రిటన్ తనకున్న ఒప్పందముల ప్రకారం, యిప్పుడు సోవియట్ రష్యాకు ఎంతసైన్యమున్నదో అంతసైన్యమును ఉంచుకోగలిగినప్పటికీ, అట్లుచేయదలచలేదని, మెక్నీల్ సోవియట్ విమర్శలకు సమాధానమిచ్చెను.

ప్రపంచ భద్రతకు అస్కారం లేకుండాచేయుటకు రష్యాకృతనిశ్చయమై యున్నట్లు కన్పించుటచేత నేమిగతా మిత్రరాజ్యాలతో కలసి సమష్టి రక్షణకు బ్రిటన్ ప్రయత్నించుచున్నదని మెక్నీల్ స్పష్టముచేసెను.

## నైరృతి ఆఫ్రికా భవిష్యత్తు

(-వ పేజీ తరువాయి)

ప్రభుత్వం, వాటిని అమలుపరచ నందులకు ఐక్యరాజ్యసమితి చింతించుచున్నది. మాండేట్ పద్ధతికి అనుగుణంగా, నైరుతి ఆఫ్రికాను పరిపాలించెదనని, నైరుతి ఆఫ్రికా తాము కొత్తగా ఎంచించిన యేర్పాటు, యూనియన్ సన్నిహిత సఖ్యముకొరకేగాని, నైరుతి ఆఫ్రికాను యూనియన్‌లో కలిపివేయుటకు గాదని, దక్షిణాఫ్రికా ప్రతినిధియిచ్చిన హామీలను, సమితి గమనించినది."

1946 డిశంబర్ 14, 1947 నవంబర్ 1వ తేదీల తీర్మానములకు భంగము లేకుండా నైరుతిఆఫ్రికా భవిష్యత్తు విషయమై, ఐక్యరాజ్యసమితితో ఒడంబడిక కుదిరేవరకూ, నైరుతిఆఫ్రికా, పరిపాలనకు సంబంధించి వార్షిక నివేదికలను దక్షిణాఫ్రికా ప్రభుత్వం సప్లయి చేయుచుండవలెనని, యీ నివేదికలను, ధర్మకర్తృత్వ సంఘం పరిశీలించి తమ అభిప్రాయములను తెలియజేయ వలసినదని ఐక్యరాజ్యసమితి కోరుచున్నది.

## ఓటింగు వివరములు

పారిస్, నవంబరు 20: నైరృతి ఆఫ్రికా ధర్మకర్తృత్వస్థాపన విషయమై భారత ప్రతినిధి ప్రతిపాదించిన తీర్మానమునకు అనుకూలముగా 21 రాజ్యములు, ప్రతికూలముగా 22 రాజ్యములు వోట్లు ఇచ్చినందున వీగిపోయినది. అనుకూలముగా వోటు చేసిన రాజ్యములు:

(1) బ్రెజిల్ (2) బర్మా (3) బైలోరష్యా (4) చైనా (5) కొలంబియా (6) కోస్టారికా (7) క్యూబా (8) జెకోస్లొవేకియా (9) ఈక్వడార్ (10) హైతి (11) ఇరాన్ (12) లైబీరియా (13) మెక్సికో (14) పెరుగ్వే (15) ఫిలిప్పైన్స్ (16) పోలెండు (17) యుక్రేన్ (18) సోవియెట్‌రష్యా (19) వనీజులా (20) యూగోస్లేవియా. ప్రతికూలముగా వోటు చేసిన రాజ్యములు. (1) ఆస్ట్రేలియా (2) బెల్జియం (3) కెనడా (4) చిలి (5) డెన్మార్కు (6) డొమినికన్ రిపబ్లిక్ (7) ఎల్‌సాల్వడార్ (8) ఫ్రాన్సు (9) గ్రీసు (10) ఐస్లెండు (11) లక్సెంబర్గ్ (12) నెదర్లాండ్సు (హాలెండు) (13) న్యూజీలెండు (14) నికారగ్వా (15) నార్వే (16) పెనామా (17) స్వీడన్ (18) టర్కీ (19) దక్షిణాఫ్రికా (20) బ్రిటన్ (21) అమెరికా (22) యురుగ్వే.

వోటు చేయనిదేశములు ఆఫ్ఘనిస్థాన్, బొలీవియా, ఈజిప్టు, ఇథియోపియా, ఇరాక్, లెబనాన్, పాకిస్తాన్, పెరూ, సౌదీ అరేబియా, సయాం, సిరియా.

# సింహళభారతీయ పౌరసత్వబిల్లు

## ఏ మార్పులేకుండనే ప్రతిపాదన

కొలంబో, నవంబరు 19 సింహళంలో నివాస మేర్పరచుకొనియున్న భారతీయుల పౌరసత్వమునకు సంబంధించిన బిల్లు తుది ముసాయిదాను సింహళ మంత్రివర్గం నిన్న చర్చించినట్లు తెలియుచున్నది.

నవంబర్ 25వ తేదీన బిల్లును శాసన సభలో ప్రతిపాదించు నిర్ణయం జరిగినట్లు వినవచ్చుచున్నది. మంత్రివర్గ చర్చల పర్యవసానముగా, బిల్లులో చెప్పుకోదగ్గ పెద్దమార్పులేమీ జరుగలేదనే తెలియుచున్నది.

భారతీయుల పౌరసత్వము విషయంపై, సింహళ భారత ప్రభుత్వముల మధ్య నడచిన ఉత్తరప్రత్యుత్తరములు పూర్తిగా, నవంబర్ 27వ తేదీన, ఢిల్లీ కొలంబోలలో ఒకేపర్యాయం ప్రకటించబడును.

సింహళంలో పుట్టి, పెరిగిన భారతీయులకు, రిజిస్ట్రేషన్ చేసుకొన్న భారతీయులకు మధ్య వివక్ష పాటిస్తూ రిజిస్ట్రేషన్ చేసుకొన్న భారతీయులు ప్రభుత్వ భూమి అభివృద్ధి విధానంవల్లగాని, రవాణావల్లగాని, చేపల పరిశ్రమలవల్లగాని ఎటువంటి ప్రయోజనం పొందకుండా వీలు చేసే క్లాజు ఒకటి యీ బిల్లు ముసాయిదాలో ఉన్నది మిగతా కొన్ని క్లాజులతోపాటు, యీ క్లాజునుగూడా భారత ప్రభుత్వం అభ్యంతరం తెలిపింది.

# పుల్లపాడు గ్రామాన్ని కృష్ణా జిల్లాలో చేర్చివేయాలి

## ప్రభుత్వానికి ప్రజల విజ్ఞప్తి

మచిలీపట్నం, నవంబర్ 19: కృష్ణా జిల్లా, కొత్తపట్నం రెవిన్యూ డివిజన్‌లో ఇమిడివున్న నిజాం జాగీరుగ్రామమగు పుల్లపాడుప్రజలు, తమగ్రామమును వెంటనే చుట్టుపట్లనున్న భారతప్రాంతములో చేర్చివేయవలెనని కోరుచు, భారతప్రభుత్వాధికారులకు, చెన్నరాష్ట్ర ప్రభుత్వమునకు నిజాంసంస్థాన సైనికగవర్నరు, పౌరపాలనాధికారులకు విజ్ఞప్తులు పంపుకొనిరి.

ఈ గ్రామము సంస్థానమునకు దూరమునఉండుటచే పరిపాలన సరిగా జరుగుట లేదని, ప్రాథమిక ప్రజావుసరములుకూడ సమకూర్చబడుట లేదని, ఈ గ్రామస్థులు ప్రతిదానికీ చుట్టూవున్న భారతప్రాంతముపై ఆధారపడవలసివున్నదని, చుట్టూఉన్న ప్రాంతములో మద్యనిషేధంఉండి ఇచ్చట లేనందున ఈ గ్రామం త్రాగుబోతులు, జూదరుల ఆకతాయితనమునకు తావలమై ప్రజలకు చాల ఇబ్బందిగ నున్నదని వారు తమ విజ్ఞప్తులలో తెలుపుకొనిరి.

పుల్లపాడుగ్రామ జనాభా 800. మొత్తం 420 ఎకరాల భూమియున్నది. స్వ.వి.

# గాంధిహత్య కేసు

## శంకర కిష్టయ్య, గాడ్సే క్రాసు పరీక్ష

న్యాయమూర్తి ఆత్మాచరణ్ కోర్టు తిరిగి శుక్రవారం సమావేశమైనప్పుడు శంకరకిష్టయ్య క్రాసుపరీక్ష జరిగినది (మొదటిభాగం నిన్న ప్రకటించనైనది) జనవరి 20 వ తేదీన హిందూమహాసభ భవనంనుండి గాడ్సే బసచేస్తున్న మరీనా హోటలుకు వచ్చినాం, అక్కడే గాడ్సే సోదరులు ఆప్టే, కర్కరే, మదన్లాల్, బడ్గేలు చేసిన పనులను కిష్టయ్య చెప్పగా న్యాయమూర్తి ఇలా ప్రశ్నించారు.

ప్రశ్న: అల్లు వచ్చించుకొనిన తరువాత ఏమైనది? మీకందరకునూ ఆయుధములను పంచియిచ్చిరా?—నీకు ఒక రివాల్వరునూ, ఒక చేతిబాంబునూ ఇచ్చిరా?

జవా: కొంత సంభాషణ జరిగినది. గదిలోనున్న అలమారాకు ఒక అద్దమున్నది—దానిముందు నిల్చుని కార్కరే నుదుట తిలకమును పెట్టుకొన్నాడు. బాడ్గేకి ఒక పిస్తలునూ, ఒక చేతిబాంబునూ ఇచ్చినారు. తక్కినవారుకూడ ఆయుధములనూ బాంబులనూ తీసుకొన్నారు. గోపాల్ గాడ్సే తెచ్చిన పిస్తలును బాడ్గేకి ఇచ్చినారు. నేను తెచ్చిన పిస్తలు నాకేయిచ్చినారు. తక్కిన రెండు బాంబులనూ ఎవరు తీసుకొన్నది జ్ఞప్తిలేదు. ఒక బాంబునూ ఒక కత్తినీ కర్కరేకి ఇచ్చినారు.

ప్రశ్న: మెరినాహోటల్ మీదినుంచి దిగుచున్నప్పుడు బాడ్గే నీతో యేమి చెప్పినాడు. తాను చేతిబాంబు విసరిన వ్యక్తిపై నిన్నుకూడ విసరమని చెప్పినాడా? తాను పిస్తలు కాల్చిన వ్యక్తిపై నిన్నుకూడ పిస్తలు కాల్చమని చెప్పినాడా? ఆ వ్యక్తి గాంధీ యను పేరుగల ఒకవృద్ధుడనీ, ఆయనను అంతముచేయవలయుననీ, నీతో చెప్పినాడా?

జవా: నాతో ఏమియు చెప్పలేదు. ఈ బాంబునూ, ఈ పిస్తలునూ నాకేల యిచ్చినావని బాడ్గేనడిగితిని. 'ఏమియునూ లేదు. నీవద్దనుంచుము' అనిమాత్రము చెప్పినాడు.

ప్రశ్న: తరువాత ఏమి జరిగినది.

జవా: గోపాల్ గాడ్సే ఇక అచ్చట మిగిలిపోయినవాటి నన్నిటినీ ప్రోగుచేసి తన సంచిలో పెట్టుకొన్నాడు. తరువాత ఆప్టే, గోపాల్ గాడ్సే, బాడ్గే, నేనూ కలసి ఒక కారులో హిందూమహాసభ భవనమునకు వెళ్లినాము. ఆ కారు డ్రైవరు ఒక సిక్కు. ఆ భవనముముందు కారుఆగగానే గాడ్సే, బాడ్గే దిగి లోపలికి వెళ్ళినారు. కొంచెముసేపటికి వారు మరల తిరిగివచ్చినారు. అచ్చటినుండి బిర్లా భవనమునకు వెళ్ళితిమి. హిందూమహాసభ భవనమునకు వెళ్ళినప్పుడు గోపాల్ గాడ్సే తలపాగా అసివేసి సన్నగా తలదువ్వుకొని వచ్చినాడు. భుజములమీద ఒక తుండుగుడ్డమాత్రము కప్పుకొన్నాడు. కళ్ళకు ఒక జోడు కూడా పెట్టుకొన్నాడు.

ప్రశ్న: తరువాత?—

బిర్లాభవనము వెనుకభాగమునకు వెళ్ళినాము. అచ్చటికి, ముందు మదన్‌లాల్, తరువాత నాథూరాం కర్కరేలు వచ్చి మమ్ములను కలుసుకొన్నారు. బాడ్గేతో వారందరూ ఏమేమో మాటాడినారు. బాడ్గే తన పిస్తలుతీసి ఒక కాకీగుడ్డల సంచిలో చుట్టినాడు. అతనివద్ద నున్న బాంబునుకూడ నన్నే పుచ్చుకొమ్మనినాడు. ఈ రెండు బాంబులను టాక్సీలో నుంచకూడదా అని [illegible]నడిగితిని. అతడు కోపముగా చూచినాడు. నేను మాటాడలేకపోతిని.

ప్రశ్న: ప్రార్థనాస్థలమునకు నీవునూ బాడ్గేయూ కలసివెళ్ళితిరా?

జవా: అవును. తక్కినవారందరూ అచ్చటనే నిలిచిపోయిరి. మేమువెళ్ళినఒక క్షణమునకు కార్కరేకూడవచ్చెను. కొలది క్షణములకే పెద్దచప్పుడు ఒక ప్రేలుడు వినిపించినది. పొగకూడ కాన్పించినది.

పోలీసువారి పోలీసు విభాగంలో మదన్‌లాలును తీసుకొనిపోవుట చూచితిని. అది యేమని బాడ్గేనడిగితిని—మాటాడవద్దని మందలించినాడు. ఒక టాంగా మాట్లాడమని చెప్పినాడు. ఆ టాంగాలో మేమిద్దరమూ హిందూమహాసభా భవనము చేరితిమి. ఆ భవనము చేరినపిదప బాడ్గే చాలా కంగారులో నున్నట్లు కనుపించినాడు. ఆ రెండు బాంబులను సంచిలోనున్న వివిధ వస్తువులను పారవేయమని నాతో చెప్పినాడు. నేను వాటిని ఆ భవనము వెనుకనున్న ఒక రాతిగుట్టలో పాతిపెట్టి వచ్చితిని. నేను తిరిగి వచ్చునప్పటికి నాథూరాంగాడ్సే, ఆప్టే, ఇద్దరూ, ఆ భవనము గేటులోనుండి బయటికి వెళ్లిపోవుచుండిరి. తరువాత బాడ్గే నేనూ కలసి ఢిల్లీనుండి రైలులో బయలుదేరి కళ్యాణ్‌కు చేరితిమి. అచ్చటినుండి తిరిగి పూనా చేరితిమి. పూనానుండి నేను షోలాపూరు వెళ్లితిని. మరల పూనాకు తిరిగివచ్చుసరికి "గాంధీజీ హత్యసందర్భమున బాడ్గే అరెస్టుచేయబడినట్లు తెలిసినది. వెంటనే ఆయనను చూచుటకు బొంబాయికి వచ్చితిని. దీక్షిత మహరాజుగారి నౌకరు సహాయముతో నా యింతటికి నేనే సి. ఐ. డి. వారి కార్యాలయమునకు వెళ్లి నగర్వాలాగారిని కలుసుకొంటిని. ఆయన నన్ను చంపనిమావకొట్టి సర్వమూ చెప్పమని నిర్బంధించినారు. ఇప్పుడు మీకు తెల్పిన విషయములన్నియూ వారితో మనవి చేసినాను.

ప్రశ్న: 11 వ తేదీన పోలీసువారిని హిందూమహాసభ భవనమునకు తీసుకొని వెళ్లి రాతిగుట్టలో నీవు దాచినవస్తువుల నన్నిటినీ చూపితివా.

జవాబు: అవును.

ప్రశ్న: ఇంకేమైన చెప్పవలసిన దున్నదా?

జవా: అయ్యా! నాకు తెలిసినది సర్వమూ కోర్టువారికి చెప్పుకొన్నాను. నేను బీదవాడను. పొట్టకొరకు బాడ్గేగారికి నౌకరీ చేయుచూ వారెచ్చటికి తీసుకొనిపోయిన అచ్చటికల్లా వారివెంట తిరుగుచుండవలసినవాడను. వారు ఢిల్లీరమ్మని తీసుకువస్తే వారివెంట వచ్చినాను. నా దేమున్నది స్వామీ! నేను వారి యూడిగము చేసుకొను యింటి నౌకరును. ఈ కుట్రవిషయముగాని మహాత్ముని హత్యవిషయముగాని నాకేమియూ తెలియదు.

ఇంకేమైన సాక్ష్యమును ఋజువుచేయ దలచితివా అని న్యాయమూర్తి ప్రశ్నింపగా లేదని కిష్టయ్య సమాధానమిచ్చెను.

తరువాత గోపాల్ గాడ్సే తన వాఙ్మూలమును చదివి వినిపించి కోర్టువారికి దాఖలు చేసుకున్నాడు. (ఆ వాఙ్మూలము నిన్నటి పత్రికలో ప్రకటింపబడినది.)

## గోపాల్‌గాడ్సే క్రాస్‌పరీక్ష

వాఙ్మూలమును విని న్యాయాధిపతి ఆత్మచరణ్ గారు గోపాల్ గాడ్సేను ఇట్లు ప్రశ్నించిరి.

ప్రశ్న: 1948 జనవరి 14 వ తేదీన మీ అన్న, నాథూరాం తన భార్యకు దఖలు కావలసినట్లుగానున్న తన జీవిత భీమాను నీ భార్యకు చెందునట్లు మార్పించుట నీకు తెలియునా?

జవా: అప్పట్లో నాకు తెలియదు.

ప్రశ్న: ఢిల్లీలోని షెరీఫ్ హిందూ హోటలులో జనవరి 19 వ తేదీన మదన్‌లాల్ ఉన్న గదికొరకు నీవు భోగట్టా చేసితివా?

జవాబు: లేదు. ఆ తేదీలలో నేను ఢిల్లీకి రానేలేదు. సెలవుపెట్టి 17 వ జనవరి నుండి 25 వరకూ మా స్వగ్రామమైన యుక్రోనులోనే యున్నాను. నా ఢిల్లీ చరిత్రయంతయూ అభూతకల్పనము.

ప్రశ్న: ప్రెసిడెన్సీ మేజస్ట్రేటు ముందు సాక్షులు నిన్ను గుర్తుబట్టినమాట వాస్తవమేనా?

జవా: సి. ఐ. డి. ఆఫీసులో నుండగా ఆ సాక్షులకు పోలీసువారు నన్ను ముందుగానే చూపిరి.

ప్రశ్న: ఈ నామూనా దస్కతులకేమందువు?

జవా: నా స్వంత దస్తూరి వ్రాయవద్దనీ, ఆ పోలికలుండునట్లు వ్రాయుమనీ పోలీసువారు నన్ను కోరిరి.

ప్రశ్న: ఈ ప్రాసిక్యూషన్ సాక్షులు నీమీద యీ అభియోగములన్నియు ఏల మోపుచున్నారో చెప్పగలవా?

జవా: చెప్పగలను; పోలీసువారి వత్తిడివలన చెప్పుచున్నారు. గాంధిగారిని చంపుటకు మా అన్నగారికి పిస్తలు నందించినది నేనేనని చెప్పవలసినదిగా పోలీసులు నన్నుకూడ అట్లే వత్తిడిచేసినారు. అది అసత్యము గనక నేను చెప్పనని నిరాకరించితిని.

ప్రశ్న: ఇంకేమైన చెప్పుకొందువా?

జవాబు: వారి ఇష్టము వచ్చినట్లు నేను చెప్పుటలేదని పోలీసువారు మూడురోజులపాటు నన్ను నానాహింసలూ పెట్టియున్నారు. ఇంతకన్న చెప్పుట కేమియునూ లేదు.

విచారణ రేపటికి వాయిదాపడినది. రేపు సవర్కార్ వాఙ్మూలముతో తిరిగి విచారణ ప్రారంభమగును.

(సావర్కార్ వాఙ్మూలము వేరే ప్రకటింపబడును.)



# గంగానదిలో పడవ ప్రమాదము

## బీహారు ప్రభుత్వ ప్రకటన

పాట్నా, నవంబరు 19: గంగానదిలో, బీహారు ఇంజనీరింగ్ కళాశాలకు దగ్గరగా జరిగిన పడవ ప్రమాదము విషయమై బీహారు ప్రభుత్వ ప్రచురణశాఖ డైరెక్టరు ఒక ప్రకటన గావించుచు స్టీమరురాం ఘాటు దగ్గరకు వచ్చుచుండినప్పుడు ప్రయాణీకులు ఘట్టమునకు అతి దగ్గరగానున్న వైపుకు త్రోసికొని వెళ్లుటచేత పడవ ఒరిగి మునిగిపోయెనని వార్తలు తెలుపుచున్న వనుచున్నాడు. పడవ దాదాపు 500 పశువులను, దాదాపు 650 మంది మనుష్యులను తీసికొని వెళ్లుచున్నట్లు, చాలామంది ప్రయాణీకులు నదిలోనికి దూకి ఈదుకొనిపోయి తమ ప్రాణములను రక్షించుకొనినట్లు విచారణవల్ల తెలియవచ్చె ననుచున్నారు. పడవ మునుగుటను చూచిన—ఇంజనీరింగ్ కాలేజి ప్రధానాచార్యుడు తమకొక వార్త పంపుచు కళాశాల ఉపాధ్యాయులు దాదాపు 200 మందిని రక్షించిరని తెలిపెననుచున్నాడు. ప్రమాదము విషయమై విచారణ జరుగుచున్నదని, పడవలోనుండి శవములను, పశువులను పైకి దీయుపనిగూడ సాగుచున్నదని ప్రకటన తెలుపుచు నేడు మధ్యాహ్నం ఒంటిగంట వరకు శవములేమియూ దొరకలేదని, పడవలో మరణించిన పశువులున్నట్లు దానిలోనికి మునిగిచూచినవారు కనిపెట్టిరనుచున్నారు.

### పడవను పగలగొట్టి శవములను పైకిదీయు నిర్ణయము

మునిగినప్పుడు పడవ యెట్లుండెనో నేటిఉదయముగూడ అట్లే యుండెను. స్టీమరు పైకప్పు, గొట్టము నీటిపైనుండెను. స్టీమరు గంగానది బాడిలో కూరుకొనిపోవుటచేత దానిని పైకితీయు ప్రయత్నము విఫలమయ్యెను. ఓడను పగులగొట్టి శవములను పైకిదీయ నిశ్చయింపబడెను. ఇప్పుడు ఓడను పగులగొట్టుచున్నారు. పైకప్పు పగులగొట్టగానే ఒక ఆవుశవము కనబడెను. శవముల దుర్గంధము వ్యాపించెను. మానవ కళేబరముల ఆచూకీ యింకా దొరకలేదు ఒక్క శవముకూడ నీటిపై తేలలేదు. నేటి అపరాహ్ణం 3-30 కు గవర్నరు ఆణే ప్రమాదముజరిగిన స్థలమునకు వెళ్ళి శవములను పైకిదీయ ప్రయత్నించుచున్నవారితో మాట్లాడిరి. (అ. ప్రె.)

# రాజాజీ సంతాప సందేశము

న్యూఢిల్లీ, నవంబరు 19: గంగానది పడవ ప్రమాదములో మరణించిన వారి కుటుంబములకు తన హృదయపూర్వక సానుభూతిని అందజేయ వలసినదని గవర్నర్ జనరల్ రాజాజీ బీహారు గవర్నరుకు ఒక సంతాపసందేశమును అందజేసెను. ఇకముందు ఇట్టి విషాద సంఘటనలు జరుగకుండ తగిన ఏర్పాట్లు జరుగగలవని ఆశించుచున్నట్లు కూడా రాజాజీ ఇందులో తెలిపెను.

# వినాయక దామోదర సవర్కారు వాఙ్మూలం

1 వ పేజి తరువాయి

వివరించి చెప్పెదను. 1905 సం॥లో నేను బొంబాయి విశ్వవిద్యాలయములో పట్టభద్రుడను పొందితిని. నేను లండనులో గ్రేస్ ఇన్‌లో చేరి చదివి, 1909 సం॥లో బారిస్టరు నయితిని. నేను సాహిత్యమునకు చేసిన సేవను కొనియాడుచు ఇటీవలనే నాగపూరు విశ్వవిద్యాలయము నాకు డాక్టర్ ఆఫ్ లిటరేచరు (సాహిత్య కోవిద) యను బిరుదు నిచ్చెను. అనేక రాజకీయ సాంఘిక, మతవిషయక సాహిత్య సభలకు నేను అధ్యక్షత వహించితిని. ఈ సభలు భారతదేశములోని అనేక ప్రాంతములందు జరుపబడెను. బొంబాయిలో దాదారువద్ద "సవర్కారు సదన్" అను పేరుగల సాధనముకలదు. నా యింటికి, భారతదేశములోని అనేక ప్రాంతములనుండియు, విదేశాలనుండికూడా అనేక వేల మందియును అనేక పార్టీలకు చెందినవారు, రైతుల మొదలు రాజుల వరకు వచ్చిపోవుచుందురు. అమెరికా, ఇంగ్లండు, రష్యా, ఆఫ్రికా మున్నగుదేశాల పత్రికా ప్రతినిధులు కూడా వచ్చిపోవుచుందురు. ఇదంతా నా నేర విచారణకు అవసరమని చెప్పుచున్నాను, కాని ఇటువంటి విషయములను చెప్పుకొనుట ఆత్మస్తుతి యగును.

### హిందూమహాసభ

హిందూమహాసభలో లాలా లజపతిరాయి, పండిత మదనమోహన మాలవ్యా వంటి మూలపురుషులు కలరు. వారిలో చాలామంది కాంగ్రెసు సభలో కూడా నాయకులుగా నుండిరి. హిందూ సంఘమును ఏకీభవింపచేసి కట్టుదిట్టము చేయుటయే యీ మహాసభ ఉద్దేశము. హిందువులకు సైనికశిక్షణ యొసంగుటకూడా యీ సభయొక్క ఉద్దేశము. భారతదేశము తను ప్రాధాన్యములేని రాజ్యముగా నుండవలెననియు దానిలో అన్నిమతాలవారికి సమానావకాశము లుండవలెననియు యీ మహాసభ లక్ష్యము. కాని హిందువులకు న్యాయతః ఉండవలసిన సౌకర్యావకాశములను, వారికి లేకుండా చేయుటయును వారికిగల ప్రాతినిధ్యావకాశమును మహమ్మదీయుల కిచ్చివేయుటయును అనిర్ధంగా మహమ్మదీయులకుఅధిక సౌకర్యావకాశముల నీయనియెడల వారు ప్రభుభక్తితత్పరులై యుండజాలరనియు వాదించుటకు మహాసభ అంగీకరింపదు.

### గాడ్సేతో పరిచయము

హిందూమహాసభ ప్రచారకుడుగా నాథూరామగాడ్సే నావద్దకు వచ్చుటయున్న అతనితో నాకు పరిచయమేర్పడుటయున్న సంభవించెను. ఆప్టేకూడా హిందూమహాసభా ప్రచారకుడుగానే నావద్దకువచ్చెను. ఇతడొక రైఫిల్ క్లబ్బును (తుపాకులుకాల్చుట సాధకంచేసే సమాజము) ఏర్పాటు చేయదలంచెను. అందుకు కలెక్టరు ఇతనికి అనుమతినిచ్చెను. డా॥ పరుచూరుగారు గ్వాలియరు హిందూమహాసభ నాయకుడుగా నాకు పరిచయము చేయబడెను. బాడ్గే హిందూ సంఘటనసేవకుడుగా పనిచేయుచున్నాడనియు ఆయుధాల షాపు పెట్టుకొని జీవించుచున్నాడనియు విన్నాను. లైసెన్సు లేకుండా అమ్మదగిన ఆయుధాలను అతడుఅమ్ముచుండెను. మిగిలిన ముద్దాయీలగు శంకర్, గోపాల్ గాడ్సే, మదన్లాలు వీరిని నే నెప్పుడూ ఎరుగను. వారినిగూర్చి నేను వినియుండలేదు. అహమ్మదునగరులోను పూనాలోను ఆప్టేయున్న పండిత గాడ్సేయున్న హిందూ మహాసభ ప్రచారకులుగా పనిచేయుచున్నట్లు నాకు వారు పరిచయము చేయబడిరి. నాకు గాడ్సేకు మధ్య నడచిన ఉత్తరములను ఆప్టేకు నాకు నడచిన ఉత్తరములకు కొన్నింటిని నాకు ప్రతికూల సాక్ష్యముగా చూపించిరి. "అగ్రణి" అనే శబ్దము ఆ ఉత్తరములో కన్పించుటవల్ల ఆశబ్దము నన్నుగురించియే ప్రయోగింపబడినదని ప్రాసిక్యూషను తరపున వాదింపబడుచున్నది.

వారు హిందూమహాసభ వ్యవహారములకు సంబంధించినంతవరకే నాతో సంబంధమును కలిగియుండిరి. నావద్దకు హిందూమహాసభా వ్యవహారముల సంబంధములో వచ్చిన వేలకొలది జనులలో వారుకూడా ఇద్దరు వ్యక్తులు హిందూ మహాసభకు న్యాయసమ్మతంగా ఉండదగిన వ్యవహార కార్యకలాపమునకు మించిన ఇతర విషయములగూర్చి నేను వారితో ఉత్తర ప్రత్యుత్తరములను జరిపినట్లుగా యీ ఉత్తర ప్రత్యుత్తరములలో చూపించదగిన అంశమువేవియు లేవు.

### బాడ్గేసాక్ష్యం నిరర్థకమైనది

అప్రూవరైన బాడ్గే తన వాఙ్మూలములో నన్నుగూర్చి చెప్పిన విషయములు అప్రస్తుతాంశములు. నేర నిర్ధారణకు అక్కరకు వచ్చేవికావు. గాంధీజీని నెహ్రూను సుహ్రావర్దీని తుదముట్టించవలెనని ఆప్టేతో నేనుఅన్నట్లుగా బాడ్గేతో ఆప్టే చెప్పెనని బాడ్గే సాక్ష్యమిచ్చెను. ఆప్టేతో నేను ఆమాటలు అనుచుండగా బాడ్గే విన్నానని చెప్పుటలేదు. నేను ఆప్టేతో అట్టిమాటలు అన్నట్లుగా సాక్ష్యమేమియు లేదు. నాపేరును నాకుగల పలుకుబడిని తన కుతంత్రములకు ఉపయోగించుటకై ఆప్టే ఆ విధముగా బాడ్గేతో చెప్పియుండవచ్చును. ఆప్టే అనేక హోటళ్ళలో దొంగపేర్లు దొంగ అడ్రెసులు కూడా యిచ్చియుండెను. లైసెన్సులేని ఆయుధములనుకూడా సేకరించెను.

అట్టి అసత్యపుమాటలను బాడ్గేతో తాము ఎన్నడూ చెప్పలేదని గాడ్సేయున్న ఆప్టేయున్న తమ వాఙ్మూలములలో చెప్పిరి. అప్రూవరుగావుండి తనప్రాణము రక్షించుకొనుటకై బాడ్గే యీ కల్పనాకథలను సృష్టించి చెప్పెను. పోలీసువారు నన్నుకూడా యీ కేసులో యిరికించుటకై యిటువంటి సాక్ష్యములను ఆతురతతో సేకరించిరి. బాడ్గే అబద్ధం చెప్పినా, గాడ్సే, ఆప్టేగార్లు అబద్ధం చెప్పినా, యీ కుట్రలో నేను చేరియున్నానని ఋజువుచేయగల మరొక సాక్ష్యం ఏమియున్నీ ప్రత్యక్షంగా లేదు.

గాడ్సేయున్న ఆప్టేయున్న బాడ్గేయున్న ఢిల్లీకి బయలుదేరిపోవుటకు పూర్వం "మీపని జయప్రదంగా నెరవేర్చుకొని తిరిగిరండి" అని నేనన్నడూ అనలేదు. బాడ్గే తన ప్రాణాన్ని త్యజించే కూడదైనట్లయితే, గాంధీజీకి ఎదురుగుండా నిలువబడికొట్టలేకపారిపోవుటయెందుచేత? పోలీసువారు యీకేసులో పెద్దవాళ్లను కొందరిని నేరస్థులుగా చేర్చవలెనని తహతహలాడుచుండిరి. అట్టిసమయంలో నామీద ఆరోపణలు చేస్తూ సాక్ష్యమిస్తే తన ప్రాణం తనకు దక్కగలదని బడ్గే మంచి ఉపాయం ఆలోచించి పైరీతిగా కథలు కల్పించి అబద్ధసాక్ష్యముల నిచ్చెను.

ఏదైనా సాక్ష్యము నమ్మదగినదగుటకు దానిని ఖాయపరచుచు ముఖ్యమైన అంశములలో ధృవపరచుచు మరొక సాక్ష్యముండవలెను. సాక్ష్య విచారణ చట్టములోని ముఖ్యసూత్రమిది. గాడ్సేగాని, ఆప్టేగాని, సవర్కారుగారి యింట్లో ప్రవేశించుచుండగా నేను చూడలేదని మిస్ మోడక్ తన సాక్ష్యంలో చెప్పెను. ఆరోజునగాని సుమారుగా ఆ రోజులలోగాని ఆప్టే గాడ్సేలు ఇద్దరిని గాని విడివిడిగాగాని నేను చూచియుండలేదు.

### మదన్లాల్ సాక్ష్యం

మదన్లాలు ఎవరో నాకు తెలియదు. అతడు నాయింటికి ఎన్నడూ రాలేదు. అతనితో నేను ఎన్నడూ మాట్లాడలేదు. అతడుచేసిన ఘనకార్యాలకు అతని వీపుమీద నేనెన్నడూ నరచియుండుటగాని "సాగింపుము నీపనులు" అని చెప్పుటగాని సంభవింపలేదు. డా॥ జెయిను చెప్పిన సాక్ష్యమునుబట్టి చూడగా, యీ హత్యకుట్రనుగూర్చి మదన్లాలు నాతో చెప్పినట్లుగా ఋజువు అగుటలేదు. డా॥ జెయినుగారికి యీకుట్రసంగతి ముందుగా తెలిస్తే పోలీసువారికి ఆ విషయమై డా॥ జెయిను ఎందుకు తెలియజేయలేదు? అని బొంబాయి ప్రభుత్వ స్వదేశాంగ మంత్రికూడా సవాలు చేసి అడిగియున్నాడు. కాని మదన్లాలు తనతో చెప్పినదంతా నిజమని డా॥ జెయిను అనుకోలేదట. కాని, ఢిల్లీలో ఒక పెద్ద కుట్ర జరుగనున్నదని జయప్రకాశ్ గారికి తెలియజేయవలెనని డా॥ జెయిను అనుకొన్నాడట. కాబట్టి డా॥ జెయినుకు మదన్లాలు అటువంటి కుట్ర కథను ఎన్నడూ చెప్పలేదని విదితమగుచున్నది. బొంబాయి ప్రభుత్వ మంత్రి మురార్జీ దేశాయిగారి సాక్ష్యమున్న అగందసింగు సాక్ష్యమున్నా కేవలం శ్రుతసాక్ష్యము. అదంతా ఒకటి రెండు అంచెలు దాటిన శ్రుతసాక్ష్యం. కనుక అదంతా సాక్ష్యానికి పనికిరాదు. డా॥జెయిను తనతో మదన్లాలు కుట్రవిషయమై చెప్పెనన్నాడు. కాని, ఆ సాక్ష్యం తిరిగి మరొకరి సాక్ష్యంమూలంగా ధృవపడలేదు. మదన్లాలు తాను ఎవరితోను అటువంటి మాటలు చెప్పలేదనుచున్నాడు. కనుక వారి సాక్ష్యము నామీది నేరారోపణలను ఋజువుచేయుటకైనను తగినట్టిది కాదని కోర్టువారు త్రోసివేయవలెను.

జనవరి 19 తేదిని ఢిల్లీలోని హిందూమహాసభ భవనమునుండి సవర్కారు సదనుకు ట్రంకు టెలిఫోనుమీద సంభాషణ జరిగెనను సాక్ష్యంకలదు కాని, యీ టెలిఫోను సంబంధంలో నాపేరు ప్రసక్తి ఎక్కడనూ లేదు.

గాడ్సేతోను ఆప్టేతోను నాకు పరిచయమున్నంతమాత్రమున నేను వారిలోకలిసి కుట్రచేసితినని వాదించుటకు వీలులేదు. ప్రాసిక్యూషను తరపున ఏదో పెద్దరికార్డు చూపబడునని మొదట చెప్పిరి. కాని అరికార్డు బయటపెట్టబడెను. అంతలో ఏమీ లేదు. నాయిల్లు సోదాచేసి 10 వేల ఉత్తరములు పట్టుకొన్నారు. నా మీద నేరం ఆరోపించుటకు తగినదేమియు వారికి అన్ని వేల ఉత్తరాలలో ఒక్కటిన్ని దొరకలేదు. నేను నిరపరాధిననుటకు యీవిషయమొక్కటే చాలును.

గాడ్సేతోను, ఆప్టేతోను నాకు నడచిన ఉత్తర ప్రత్యుత్తరాలు, యీ కుట్రజరుగుటకు సంవత్సరం పూర్వమే ముగిసినవైయుండెను. నన్ను వారు గురువుగా భావించియుండవచ్చును. చాలామంది హంతకులు నేరస్థులు తమ గురువులయెడల భక్తితత్పరులుగానే ఉంటారు. చాలామంది హంతకులు తమ తలిదండ్రులయెడల భక్తి కలిగివుంటారు. కాని ఆగురువులుగాని తలిదండ్రులుగాని అంతమాత్రంచేత ఆనేరములలో సంబంధం కలిగియున్నారనుటకు వీలుండగలదు.

గాంధీజీ "క్విట్ ఇండియా" ఉద్యమమును దౌర్జన్యరహితంగా సాగింపవలెనని ఉద్దేశించెను. కాని గాంధీకి సహచరులైన కాంగ్రెసువారులే కొందరు దొంగచాటుగా దౌర్జన్యములకు దిగిరి. కాని గాంధీజీ అట్టి దౌర్జన్యములను ఖండించెను. ఆ దౌర్జన్యములను చేసినవారు గాంధీ మహాత్మాకీ జై అని కేకలు వేస్తూ చేసిరి. బ్రిటిష్ గవర్నమెంటుకూడా గాంధీజీని ఆ నేరములకై నిందితునిగా భావించలేదు. వారు గాంధీ మహాత్మాకీజై అని అరచిరి, కాబట్టి గాంధీజీనే సంప్రదించియే యీ పని చేసిరని గవర్నమెంటు నిందించలేదు. ప్రాసిక్యూషనుతరపు వారు నామీద ఆరోపించిన నేరములను ఋజువుచేయుట దుష్కరమని భావించిన మీదట వారింత అవకతవక సాక్ష్యమును సేకరించి తప్పుల తడికగా కథలను అల్లుకొని వచ్చిరి.

"గాంధీని నెహ్రూను సుహ్రావర్దీని తుదముట్టించబోను" అని నేను పల్కినట్లుగా చెప్పబడిన సాక్ష్యంమీదను "మీపని జయప్రదంగా నెరవేర్చుకొని తిరిగి రండి" అని నేను పల్కినట్లుగా చెప్పబడిన సాక్ష్యం మీదను నా మీద చేయబడిన నేరారోపణ నిలువబడియున్నది. ఆ రెండు వాక్యములు నేను పల్కనాననే నేరారోపణ మీదనే నాకు సంబంధించిన కేసు అంతా నిలువబడియున్నది.

గాంధీజీని హత్యగావించుటకు గాని నెహ్రూను హత్య గావించుటకు గాని నేను సంకల్పించునటువంటి వాడను కాను. 1908 లో లండనులోని శ్యామజీకృష్ణవర్మగారి "ఇండియా భవనము" నావశమందుండేది. ఆ భవనములోనే గాంధీజీ అప్పుడు దిగి మకాముచేసెను. అప్పుడు మేమిద్దరము కలిసి మెలిసియుంటిమి. నన్ను గురించి గాంధీజీ చాలా ఆదరణముగా యంగ్ యిండియా పత్రికలో వ్రాస్తూ ఉండేవాడు.

1940 సం॥ అనంతరము అనేక పర్యాయములు నేను బహిరంగ ప్రకటనలు పత్రికలలో చేసితిని.

(1) నెహ్రూకు 1940 లో 4 సం॥ల శిక్ష విధింపబడినప్పుడు 1943 లో గాంధీ నిర్బంధంలో ఉంచబడినప్పుడు 1943 లో జిన్నా నుచంపుటకు దౌర్జన్యం చేయబడినప్పుడు గాంధీ 75 వ జన్మదినోత్సవమునాడు 1944 లో కస్తూరిబాయి మరణించినప్పుడు, ఆగాఖాను మందిరమునుండి గాంధీజీ విడుదల చేయబడినప్పుడు నేను అనేక ప్రకటనలు పత్రికలలో చేసితిని.

పాకిస్తాను ఏర్పడినప్పటికి మనకు స్వాతంత్ర్యము లభించినది. స్వాతంత్ర్యం లభించినందుకు నేనుఆనందించితిని. విభక్త దేశమును తిరిగి అవిభక్తము చేయవలసియున్నది. అందుకొరకై మన ఇండియాను కట్టుదిట్టం చేసికోవాలి. మన కేంద్రప్రభుత్వమును బలిష్ఠముగా చేసికోవాలి అని నేను వాదించితిని. దేశంలో అంతఃకలహములను తలయెత్త రానీయరాదు. మనకేంద్రప్రభుత్వముపై తిరుగుబాట్లు రానీయరాదు. అందువల్ల కాంగ్రెసున్ను మహాసభయున్నా ఏకముఖంగా వ్యవహరించవలెనని నేను వాదించితిని. ఢిల్లీలో జరిగిన అన్నిపక్షాల హిందూసభకు నేను జబ్బుగా ఉండిన్ని అధ్యక్షత వహించితిని. డా॥ శ్యామప్రసాదుముఖర్జీగారు కేంద్ర మంత్రివర్గంలో ఒక మంత్రిపదవిని స్వీకరించిరి. గాడ్సేయున్న ఆప్టేయున్న ఇంకొకరిమాట వినే తత్వం కలవారుకారని ప్రాసిక్యూషను తరపుసాక్ష్యంవల్ల తెలియుచున్నది. అన్నిపార్టీలవారు ఏకం కావలెనని నేను బోధించినను వారు వినలేదు.

1948 జనవరిమాసం అంతా నేను ప్రతి దినము జ్వరముతో బాధపడుచుంటిని. జనవరి 30 తేదీని ఆకస్మికంగా గాంధీజీహత్య వార్త పత్రికలలో విని నిర్ఘాంతపోతిని.

ప్రాసిక్యూషన్ తరపున సాక్ష్యములు నేను కుట్రచేసితినను విషయము ఋజువు కాలేదు. నాకుట్ట ఆయుధములు వగైరా ఏమిన్ని దొరకలేదు. నావద్ద దొరికిన 10 వేల ఉత్తరాలలో నేరాధారమైన విషయము లుకన్పింపలేదు. నేను పల్కియుండినట్లుగా చెప్పబడిన మూడులేక 4 వాక్యాలనుబట్టి నామీద కేసు బనాయించబడినది ఈ వాక్యాలు నేను పల్కినట్లుగా ప్రత్యక్షసాక్ష్యం ఏమీలేదు.

నేను గాంధీజీయెడల యెట్టి ద్వేషభావం కలవాడను కానని నేను పత్రికలలో చేసిన ప్రకటనలున్ను గాంధీజీ నాకు వ్రాసిన ఉత్తరాలున్ను ఋజువుచేయుచున్నవి కనుక, నన్ను నిరపరాధిగా కోర్టువారు నిర్ణయించి విడుదల చేయవలెనని ప్రార్థించుచున్నాను.

# బాజ్‌పాయ్ ప్రకటన

1 వ పేజి తరువాయి

[illegible], భారతదేశం తరఫున చేవ్రాలు పెట్టినవారెవరుచే, సర్ గిరిజాశంకర్ బాజ్‌పాయ్, పాలెస్‌డి లియాయే లో, సమితి సమావేశచర్చలను బహుశ్రద్ధగా పరిశీలించుచూ, భారతప్రతినిధి వర్గనాయకురాలు శ్రీమతి పండిట్‌ను, [illegible] సమితి సభ్యులను కలుసుకొని సంప్రదించుచున్నాడు. సర్ బాజ్‌పాయ్, నారాంతంలో లండనుకువెళ్లి అచటినుండి భారతదేశమునకు ప్రయాణమువగలనని అనుకొనుచున్నాడు.

# పెన్నారు - కుముద్వతి ప్రాజక్టు

## మైసూరు మదరాసు ప్రభుత్వముల ఒడంబడిక

మదరాసు, నవంబరు 20: ప్రభుత్వ ప్రకటన యిట్లుగలదు: పెన్నారు-కుముద్వతి ప్రాజక్టులగూర్చి, వాగరినదిపై [illegible] వానితిప్ప ప్రాజక్టునుగూర్చి సెప్టెంబరు 30 తేదీన మదరాసు మైసూరు ప్రభుత్వ ప్రతినిధులు చర్చించి ఒక నిర్ణయానికి వచ్చిరి. ఆ నిర్ణయం అనుసరించి జరుపుట గూర్చి నవంబరు 9, 10 తేదీలందు రెండు ప్రభుత్వాల ఛీఫ్ ఇంజనీర్లు జరిపిన చర్చలలో సమావేశమయి ఏకాభిప్రాయమునకు వచ్చిరి. అన్ని విషయాలందు అంగీకారం కుదిరింది. ఒకటి రెండు చిన్నవిషయాలగూర్చి తేలినావల, మైసూరు ప్రభుత్వం వారు పెన్నారు కుముద్వతి ప్రాజక్టు నిర్మాణం కొనసాగింపవచ్చును. అంతేకాక పరిశోధనలు పూర్తియై అంచనాలు తయారుకాగానే భైరవానితిప్ప జలాశయంకూడ నిర్మింపవచ్చును. ఈ ఏర్పాటు ప్రకారమే మైసూరు ప్రభుత్వం వారు [illegible] పెన్నానదిపై గోరిబిదనూరువద్ద చిన్న ఆనకట్టలు, వాగరి నదిపై నారాయణపూరు ఆనకట్టను కట్టుకోవచ్చును.

పెన్నారు కుముద్వతి ప్రాజక్టులో హిందుపురంవద్ద కట్టే ఆనకట్టనుండి చెరిపైపుపోయే కాల్వలద్వారా 6000 ఎకరాలు సాగుచేయవచ్చు; 8 చెరువులు నింపబడును. పరిగి [illegible] చెరువులు నింపబడును.

భైరవానితిప్ప రిజర్వాయరువలన అనంతపురంజిల్లాలో కల్యాణదుర్గ తాలూకాలోను, బళ్ళారిజిల్లాలో రాయదుర్గం తాలూకాయందు సుమారు 10,000 ఎకరాలు ప్రాత క్రొత్త వ్యవసాయము క్రింద సాగును. ఈ రిజర్వాయరుక్రింద మునిగిపోవు స్థలము కొనియిచ్చుటకు మైసూరు ప్రభుత్వము అంగీకరించెను.

మైసూరు మదరాసు ప్రభుత్వముల ఒడంబడిక ఉభయులకు లాభదాయకంగా నుండి, చిరకాలంనుండి ఆపబడిన ప్రాజక్టులు కొనసాగి, కరవులకు పాలయిన ప్రాంతాల [illegible].

# తుంగభద్ర ప్రాజెక్టు మునుపు భూములకు నష్టపరిహారం

చెన్నపట్నం, నవంబరు 19: తుంగభద్ర ప్రాజెక్టువల్ల మునిగిపోవు భూములకు 1941 మార్కెట్ విలువపై నూటి 75 వంతులు అధికంగా (నూటి 15 వంతులు సోలేషియం కాక) నష్టపరిహారం ఇవ్వవలెనని ప్రభుత్వం ఇదివరలో ఉత్తరువు చేసింది. కాని తుంగభద్ర ప్రాజెక్టువల్ల నష్టపడినవారి సహాయం నిమిత్తం నియమింపబడిన రిలీఫ్ కమిటీ పరిహారమును హెచ్చించవలెనని సూచించినందువల్ల ప్రభుత్వం అంగీకరించి (నూటి 15 వంతులు సోలేషియం కాక,) నూటి 85 వంతులు అధికంగా ఇచ్చుటకు ఉత్తరువు చేసింది. కట్టడాల విషయంలో మాత్రం మార్కెట్ విలువను చెల్లించి, పైన నూటి 85 వంతులు [illegible] అనుసరించి చెల్లింపు వాయిదా వేయవలెనని ప్రభుత్వం ఉత్తరువు చేసింది. 1941 లోనూ 1942 లోనూ భూమిస్వాధీనచట్టం ద్వారా స్వాధీనపర్చుకొనబడిన భూములకూ, (అవి ముంపుక్రింద కాకపోయినా) కూడా ఈ హెచ్చు పరిహారం అనువర్తింప చేయవలెనని కూడా ఉత్తరువు చేసెను.

# పట్టాభిగారికి డి. లిట్ పట్టము

విశాఖపట్నం, నవంబరు 20: నూతన రాష్ట్రపతి డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులుగారికి, డాక్టర్ ఆఫ్ లిటరేచర్ పట్టమును ఇవ్వవలెనని ఆంధ్ర విశ్వకళాపరిషత్తు సిండికేటువారు నిర్ణయించినట్లు తెలిసినది.

డాక్టర్ పట్టాభిగారికి ఈ పట్టము, డిసెంబరు 11న జరిగే స్నాతకోత్సవమున ఒసగబడును. ఒకవేళ పట్టాభిగారు స్నాతకోత్సవమునకు రాలేక యున్నచో మరొకప్పుడు వారిని ఆహ్వానించి ఇవ్వబడుటకు గాని [illegible] ఇవ్వుట జరుగునదని తెలియుచున్నది. (స్వ. వి.)

# వారఫలాలు

శ్రీ రావినూతల అంజనేయులు

నవంబరు 21-వ తేదీ మొదలు 27-వ తేదీ వరకు

### గ్రహస్థితి

రవి 25 నుండి బుధుడూ (వృశ్చికం) కుజ గురువులు (ధనుస్సు) శుక్రుడు (తుల) శని (సింహం) రాహువు (మేషం) చంద్రుడు (కటక - సింహ, కన్య - తుల) 21 శుక్ర చంద్ర (కేంద్రం) 23 బుధచంద్ర (కేంద్రం) కుజచంద్ర (కోణం) 24 గురు చంద్ర రాహుచంద్ర (కోణం) 25 శుక్ర ఇంద్ర (కోణం) కుజచంద్ర (కేంద్రం) 26 గురుచంద్ర (కేంద్ర) కుజ ఇంద్ర (సమసప్తకం).

### ధరలు

**ప్రత్తి (జారిల్లా) నూలు - వస్త్రాలు**

మార్కెట్టు పరిస్థితులు గమనించడం అవసరం. నేజీ వేగం క్రమేణా తగ్గే సూచన లున్నవి. అతిచారియైన గురువును సమీపించడంలో కుజుడు గమనించతగిన మంచీ తీసుకరాలేదు.

**వెండి-బంగారాలు**

మార్కెట్టులో చలామణి కొద్దిగా హెచ్చే సూచనలున్నవి.

**వాటాలు**

రాజకీయ పరిస్థితులవల్ల డెప్రెషన్ హెచ్చుతుంగా అగపడి-తీవ్రమైనవనుక బాటు పొందవచ్చు.

**ధాన్యములు-ఆహారవస్తువులు**

పొట్టుధాన్యముల తీవ్రత తగ్గుతుంది. నూనెలలో వ్యత్యాసాలు ఎక్కువఅవుతవి. సుప్రా, దుంపలూ కొంత తగ్గతవి.

### లగ్న ఫలాలు

**మేషం (అశ్వని, భరణి, కృత్తిక, 1పాదం)**

ఈ వారంలో 25 సాయంత్రం 3 గంటలవరకూ మీరుచేసే యోచనలకూ జరిపే పనులకూ సంబంధం యుండదు. మీరు అనుకున్నట్లు జరిపినవి అన్నీ సఫలం అవుతవి. కాని మధ్య మధ్య ఇతరులు ఏమి చేస్తున్నారో అని వారిని అనుకరించడం వల్లా వారి సలహాను పొందడంవల్లా ప్రయత్నములకు భంగం కలుగుతుంది. దస్తుపడిన కార్యక్రమం వారాంతానికి ఏలాగైతే నేక ముగింపు చేయకలుగుతారు. 26, 27 పరిష్కారాలకు అనుకూలం. వ్రాతలు లోపకరం కాగలవు. ప్రయాణం జరుగుతుంది.

**వృషభం (కృత్తిక 2, 3, 4 రోహిణి మృగశిర 1, 2. పాదాలు)**

ఈ వారంలో 23 మధ్యాహ్నం లోపుగా కార్యక్రమంలో ముఖ్యమైన భాగం, వ్రాతలు ముగించడం అవసరం. ఆరోగ్యం సరిగాయుండదు. 48, 56, 63 ఆపై వయస్సువారూ అతిమూత్రవ్యాధి, నరముల బలహీనతవల్ల బాధపొందుతారు. 22, 23, 24 ల్లో శ్రమ ఎక్కువ. 24, 25, 26 ల్లో సమాజక వ్యవహారాల్లో విసుగూ, ఇరుగుపొరుగుతో కలహాలూ కలిగే సూచనలున్నవి. 22 శుభవార్త.

**మిథునం (మృగశిర 3 4 పాదాలు ఆర్ద్ర), పునర్వసు 1, 2, 3 పాదాలు)**

ఈవారంలో మీరు చేసే ప్రయత్నాలకు ప్రథమంలో విఘ్నాలుకొన్ని అగపడినా ముందుదారి చక్కగా యుంటుంది. కీర్తి ప్రతిష్టలు పెరిగే ప్రతాప్నాలు జరుపుతారు. గౌరవములకు సంబంధించిన వ్యవహారాలలో మీకు వీలు కలుగుతుంది. ధనాదాయాల్లో గొప్ప అభివృద్ధి ఏమీ అగపడదు కాని లోటుండదు. వృద్ధుల ఆరోగ్యంలో కొంచెం జాగ్రత్తవహించడం మంచిది. ప్రయాణాలు ఆగుతవి. 24, 25 పరిష్కారాలకూ, వ్రాతలకూ మేలు.

**కర్కాటకం (పునర్వసు 4, పుష్యమి ఆశ్రేష)**

ఈవారంలో పరిస్థితులు గత వారంలో కన్నా మేలుగాయుంటవి. చిన్న ప్రయాణం ఆప్తులనూ బంధువులనూ కలవడం సుఖ సంప్రతింపులు కలుగుతవి. ఒకానొక సమయంలో సమాజంలో ఉన్నవాళ్లతో యున్న వారితో ఎదిరించి వాదించవలసి వస్తుంది. కాని న్యాయపక్షంలో యుండడంవల్ల మీ మాటే పాటించబడగలదు. ధనకార్యాలు సంతోషంగా నెరవేరుతవి. 21, 22 ప్రయాణానికీ 26, 27 పరిష్కారాలకూ వ్రాతలకూ మేలు.

**సింహం (మఖ, పుబ్బ, ఉత్తర 1పాదం)**

ఈవారంలో మీ యత్నకార్యాలు తాత్కాలికంగా యుంటవి. సమాజంలో పరిస్థితులు ప్రశాంతం కలిగించకలవు. అకారణంగా ఒక శత్రువుకి అపకారం జరుగుతూ యుండడం చూచి ఏమీ చేయలేకపోతారు. గొప్పవాడను అని అనుకొనేవారిలోని కుటుంబం ... చేయడంవల్ల కొంత అశాంతి కలిగించకలుగుతారు. ఖర్చులకు మితియుండదు. 24, 25 ప్రయాణానికి మేలు. పరిష్కారాలు అగుతవి.

**కన్య (ఉత్తర 2 3 4 పాదాలు హస్త చిత్త1, 2 పాదాలు)**

ఈ వారంలో కుటుంబ వ్యవహారాలలో అనుకోదగిన మార్పు లేమీయుండవు. కుటుంబంలో భాగ్యసిద్ధి ఆరోగ్యం తృప్తికరంగా యుండదు. ఎదురుచూచే సహాయం అనుకులలో లభించనందువల్ల యత్నకార్యాలు సానుకూలం అగుతవి. మీ అభివృద్ధి చూచి మీ ప్రతికక్షులకు అసూయ మరికొంత హెచ్చుగుంది. 21.22.23 మధ్యాహ్నం వరకు పరిష్కారాలూ, వ్రాతలూ 26,27 ప్రయాణం నూలవలసిన్నం. లాభకరం 22 శుభవార్త.

**తుల (చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

మీరు ప్రస్తుతం జరిపే ప్రతి ప్రయత్నమూ ఇతరులకూ ప్రజాబాహుళ్యానికి మిగుల ప్రయోజనకరంగా యుంటుంది. అయితేనేం! కొంతమంది మీ అభిప్రాయాలకు వ్యతిరేకించి అడ్డు తగలడంవల్ల ఎటు నడవడానికీ వీలులేని సందిగ్ధస్థితి కలుగుతుంది. వ్యవస్థలపై అధికంగా ఖర్చింపు చేయడం కలుగుతుంది. మెల్లగా సావధానంతో మీ కార్యాలు ముగింపుకు వచ్చి మరల ఫలితం ఇవ్వకలవు. కాని కొన్నిసారాలు ఆగవలసి యుంటుంది. 22,23 ప్రయాణం, 24,25 పరిష్కారాలూ లాభకరం.

**వృశ్చికం (విశాఖ 4 పాదం, అనూరాధ జ్యేష్ఠ)**

ఈ వారంలో పరిస్థితులు గతవారంలో కన్నా మేలుగా యుంటవి. ద్వితీయంలో కుజ గురువుల సంబంధం కొంత మానసిక వ్యథను కలగిస్తుంది. ఉద్యోగ పరిస్థితులు అసంతృప్తికరంగా యుండకపోవు. మార్పును ఎదురు చూస్తారు. వృత్తి ఉద్యమాల్లో కార్యక్రమం సులభంగా ముగించ కలుగుతారు. 23 మధ్యాహ్నంవరకు ఆరోగ్యం బాగా యుండదు. 24, 25 ప్రయాణానికీ, 26, 27 పరిష్కారాలకూ మేలు.

**ధనుస్సు (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పాదం)**

ఈ వారంలో ఆదుపులోనే హంసపాదుగా ప్రయత్నించి ప్రయాణం అపశకునాలు కలిగి ఆగిపోతుంది. తరువాత 25 వరకూ స్థిరమైన ఆలోచనలు కలిగి వృత్తి ఉద్యమాలు సాగించలేరు. సందేహములు ఎక్కువ అవుతవి. తరువాత ప్రయాణం-బంధువులను కలవడం కలుగుతుంది వారాంతంలో పరిష్కారాలకు ప్రారంభించడం మంచిది. 25 శుభవార్త.

**మకరం (ఉత్తరాషాఢ 2, 3, 4 పాదాలు శ్రవణం, ధనిష్ఠ 1, 2 పాదాలు)**

ప్రస్తుతం గ్రహస్థితి అనుకూలంగా అగపడక పోయినా ఇది మీకు యోగకాలమే! ముందు ముందు సహాయపడగల గొప్పవారి స్నేహితం మీకు లభించకలదు. కాని ఆరోగ్యం, కుటుంబ పరిస్థితులు-తృప్తికరంగా అగపడవు. గౌరవం ఎక్కువగాయున్నా శరీరసౌఖ్యం తగ్గును. 21-22 ప్రయాణానికీ మేలు. పరిష్కారాలూ-వ్రాతలూ ఆపడం మంచిది. 21 శుభవార్త.

**కుంభం (ధనిష్ఠ 3, 4 పాదాలు శతభిషం పూర్వాభాద్ర 1, 2, 3 పాదాలు)**

ఈవారంలో మీ ప్రయత్నాలకూ ఆటంకాలు కలుగుతవి. కాని శ్రమతో స్వబుద్ధిపై ఆధారపడి ముగించ కలుగుతారు. ఖర్చులు మితిమీరి కష్టం యుండదు. కొన్ని సమయాల్లో స్వయంశక్తిపై - పేకాటల్లో బుద్ధిపోతుంది. కొన్ని పద్ధతులపై ఆత్మాశ్రయవలిగే మేలు పొందుతారు కేదారచింత కలుగుతుంది: 41-48-55 పై వయస్సువారు అతిమూత్రం, పళ్ల నొప్పులతో బాధపొందుతారు. 21-22 పరిష్కారాలకు మేలు 22 శుభవార్త.

**మీనం (పూర్వాభాద్ర 4 పాదం ఉత్తరాభాద్ర, రేవతి)**

ఈవారంలో సాధ్యమైనంతవరకు శరీరకంగానూ-మానసికంగానూ శ్రమ తగ్గించుకొన ప్రయత్నాలు చేయడం మంచిది. ఆరోగ్యం తృప్తికరంగా యుండదు. ధనుస్సులో కుజ గురువుల సామీప్యం-రాజకీయంగాగానీ- అధికార పదవులలోగానీ-గొప్ప ఎన్నిక వేయుటకు దారి కలిగిస్తుంది. 24-25 పరిష్కారాలకూ, 26-27 ప్రయాణానికి మేలు. జలుబుబాధ అప్పుడప్పుడూ కలుగుతుంది.

---

## తీవ్రగాయాలు కలుగజేసినందుకు శిక్ష

చెన్నపట్నం, నవంబరు 19: గత ఆగస్టు 22 వ తేదీని కృష్ణన్ అను నతనిని కమువున కత్తితో పొడిచి హత్యచేసినను నేరమునకై చార్జిచేయబడిన సుబ్రహ్మణి అను నతనికిమద్రాసు హైకోర్టు సెషన్సులో న్యాయమూర్తి కే. సుబ్బారావుగారు జూరీ సభ్యులతో ఏకీభవిస్తూ ముద్దాయికి హత్యనేరము నకు ... తీవ్రగాయాలు కలుగజేసినందుకు 7 సంవత్సరముల కఠిన శిక్ష విధించిరి. పై ముద్దాయికి యీనేరము విషయంలో తోడ్పడిన చక్రపాణి అను రెండవ ముద్దాయికి 3 నెలల కఠినశిక్ష విధింపబడెను.

# గ్రంథ సమీక్ష

## ఆభాస క్రైస్తవము

రచన: కోట వెంకటాచలంగారు

ప్రాప్తిస్థానం గ్రంథకర్త, గాంధీనగరం విజయవాడ.

శ్రీకృష్ణుడే క్రీస్తు అనీ యేసుక్రీస్తు అనువాడు లోకమున పుట్టనే లేదనీ, నిరూపించుట ఈ గ్రంథము యొక్క ప్రధాన లక్ష్యము. క్రీస్తు జీవితమునకు నూ, కృష్ణ భగవానుని జీవితమునకును గల సామ్యములు ఈ వాదమునకు ఆధారములుగా ఎత్తి చూపబడినవి.

కేవల సామ్యములను, తార్కికులు, ప్రమాణములుగా అంగీకరింతురా?

## జనత
### (మార్క్సిస్టు సిద్ధాంత పక్షపత్రిక)

ప్రకటన. సంపాదన: గంగినేని వెంకటేశ్వరరావుగారు, బ్రాడీపేట, గుంటూరు విడిప్రతి వెల: 0-8-0 సం|| చందా 12-0-0

ఈ పత్రిక ప్రథమ సంచిక మా కార్యాలయానికి చేరింది.

"మార్క్సిస్టు సిద్ధాంతాలను వ్యాప్తిలోకి తేవటానికి ఉద్దేశింపబడిన పత్రిక" గా సంపాదకీయంలో తెలుపుతున్నారు.

ఈ సంచికలోని వివిధ శీర్షికలు:—

హంగరీ కమ్యూనిస్టు పార్టీలో సిద్ధాంత కృషి, యూగోస్లావ్ కమ్యూనిస్టు పార్టీపై కోమిన్ ఫారం తీర్మానం, చైనా పతనం తప్పదు, యుగోస్లావ్ కమ్యూనిస్టు పార్టీ నాయకులు మార్క్సిజానికి స్వస్తి చెప్పారు, ప్రపంచ దురాక్రమణకు అమెరికా యెత్తులు - ఇత్యాదులు.

ఇకపోగా మన దేశానికి సంబంధించినంత వరకూ ఉన్న వ్యాసములల్లా ఒక్కగా ఒకటి—'నొట్లముద్రణం అరికట్టే పేరిట ప్రజల పొట్టకొట్టటానికి, రాబందులన్నీ చేరాయి - అని.

ఈ పత్రికకు మరికొంత జాతీయ దృక్పథం వుంటటం యెంతైనా వాంఛనీయం.

## గాంధీజి శతకము

రచన: షేక్ ఖాదరవలి. ప్రతులకు: గ్రంథకర్త, వేంపల్లె, కడపజిల్లా వెల: 0-4-0

వేమన ఆటవెలదులకు అనుకరణముగా, ఇందలి పద్యములన్నియూ, తేట తెలుగు నుడికారముతో హృద్యములుగా నున్నవి. బాల బాలికలకు మహాత్ముని యందు తాత్పర్యములు కల్గించుటకు అనుకూలముగా నున్నవి.

ఈ కవి జాతీయన మహమ్మదీయుడయ్యూ, తెలుగు భాషలోని ఈ జాతీయముల వన్నెంటినీ ఇట్లు సంక్రమింప జేసుకొన గలిగినందుకు అభినందనీయుడు.

ఈ గ్రంథము గాంధీజీ వర్థంతికి ఈ బీద కవి కానుక:

'కానుక నొసగవాడ గాంధివర్థంతికి
లేదు పైస, నేను-బీదనుగుట
వ్రాసి శతక మేను-వర్థంతి కానుకగా,
యిచ్చి తియ్య, మీరు-పుచ్చుకొనుడు.

## ప్రాచీన యోగులు
### (పరిశోధక గ్రంథము)

రచన: కొడాలి లక్ష్మీనారాయణ గారు, బి. ఏ., ప్రాప్తిస్థానం: గ్రంథకర్త, తెనాలితాలూకా, మోపర్రు. వెల: 0-8-0

ప్రాచీన భారతపు వైజ్ఞానిక వాతావరణమంతయూ కనులకు కట్టినట్లు అభివర్ణింపబడినది. గ్రంథనామమును తిలకించిన ప్రాచీన యోగుల సాధనలకు సంబంధించిన వివరములు లభించునేమోయను ఆశ ఉదయించునుగాని అట్టి సాంకేతిక విషయములేవియు ఇందు ప్లేఖింపబడి యుండలేదు.

## శ్రీ శంకర విజయం

శ్రీ శంకరవిజయము గ్రంథకర్త: కవి భూషణ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు. ప్రకాశకులు: వెంకట్రామ అండ్ కో. డెమ్మీ 528 పుటలు. వెల రూ 5-0-0.

శ్రీ శంకర భగవత్పాదులవారు సాక్షాత్ శంకరావతారమని ప్రసిద్ధి. ముప్పదిరెండేండ్ల జీవితములో సకలవేదములు, సర్వశాస్త్రములు, హస్తగతము చేసికొని ప్రస్థానత్రయమునకు ప్రసన్న గంభీరములను భాష్యములు రచించి, పెక్కు వేదాంత గ్రంథములను, ప్రతి పదమునను సౌందర్యము చిప్పిల్లుచున్న సౌందర్యలహర్యాది స్తోత్రరాజములను రచించి, వాదమునందు పండిత ప్రకాండుల నోడించి, అనేకు కేతాలను వేదాంతమును సుస్థిరముగా నెలకొల్పిన మహాను భావుడు సామాన్యుడు కాడని వేరుగా చెప్పనవసరములేదు. శివపురాణము శంకరులు సాక్షాత్తు పరమ శివులనియే వాకొను చున్నది.

ఇట్టి మహాపురుషుని దివ్యచరిత్రము ను వేదవేదాంత పారంగతులగు మాధవాచార్యులవారు సంస్కృత భాషలో గంభీరమును, మనోహరమును అను కావ్యముగా రచించియున్నారు. ప్రస్తుతము మాకొ ... వ్యాలయము చేసిన గ్రంథము ఈ కావ్యమునకు ఆంధ్రానువాదము.

గ్రంథము అనువాదమయ్యు ధారాశుద్ధి కలిగి స్వతంత్ర రచన వలె కనిపించుచున్నది. ఆంధ్ర సంస్కృత భాషలు రెంటియందును ప్రజ్ఞగల గ్రంథకర్తకవితా ప్రవంతి అతి నిర్మలమై, మనోజ్ఞమై, ప్రసాదగుణము కలదై కోమల పాకము నాశ్రయించినది. శ్రీ శంకరులు విమతులతోను, వ్యాసభట్టారకునితోను వాదించిన ఘట్టములయందు వీరు చక్కని వేదాంత పరిజ్ఞానమును ప్రదర్శించుచు, పూర్వపక్ష సిద్ధాంతములను హృద్యముగా ప్రపంచించియున్నారు. శంకర మండనమిశ్రులవాద సభ చూపరకెంత కన్నుల పండువుగానుండి యుండునో ఈ గ్రంథమునందలి తద్వర్ణనమంత మనోజ్ఞముగాను, కర్ణరసాయనముగాను ఉన్నది. కాపాలికుని కథగూడ రస్యముగా నున్నది. శృంగారరసము కోరవడుటవల్ల గ్రంథమునకేకొరంతయు కలుగుటలేదు. గ్రంథ శైలి ప్రాచీన ఆంధ్ర కావ్యకర్తల ఉదాత్త గంభీరశైలిని జ్ఞప్తికి తెచ్చుచున్నది.

గ్రంథారంభమున శంకరుని జన్మకాలము మున్నగు విషయములనుగూర్చి విపులమగు చర్చ, శంకరుని విషయమై దేశీయ విదేశీయ పండితులు తెలిపిన అభిప్రాయములు కలవు. తర్కరత్న న్యాయ వేదాంత విద్యాపారీణులగు అప్పన్న శాస్త్రిగారు గుణిపులమును లిఖించి వ్రాసియున్నారు.

ఇంక గ్రంథప్రచురణము విషయమై నాలుమాటలు చెప్పవలెను. ఈ గ్రంథ ప్రచురణకు కారకులైన శ్రీ ఈదర వెంకట్రావుగారి సుగుణములను, వదాన్యతను గ్రంథకర్త అత్యంతము ప్రశంసించియున్నారు. గ్రంథకర్త చెప్పిన దానిలో అతిశయోక్తి యేమియు లేదని శ్రీ అప్పన్న శాస్త్రిగారు నుడువుచున్నారు. ఉత్తమ కవులను పోషించి, వారికే కొరత లేకుండా చేయు మహాశయులు ఈకాలములో గూడ నుండుట అత్యంతము సంతసింపదగిన విషయము. ఇట్టి ఉత్తమ గ్రంథములనేకము శ్రీ వెంకట్రావుగారు ప్రచురించెదరని ఆశించుచున్నాము. వెల అతిసరసముగా నుండుటచేత అందరు ఈ గ్రంథమును చదివి శంకరాచార్యుల దివ్య చరిత్రమును తెలిసి కొనదగుదురు.

# తెలుగు సోమరులు

## ప్లీడర్లు - డాక్టర్లు - ఉద్యోగులు

ప్రాక్టీసులలో జీ కుదరనివ్వని ప్లీడరు, రోగికి రోగము కుదురనివ్వని వైద్యుడు దేశములో కలరు, అని పెద్దలు ఘోషించుచున్నారు. దానికి కారణము వ్యాపార తత్త్వము ప్లీడర్లకు డాక్టర్లకు పంటబట్టుటయే. దేశములోని ప్లీడర్లందరూ డాక్టర్లందరూ ఇట్టివారని ఎవరునూ చెప్పరు. ఇట్టివారొక్కరున్నను చాలదా! గొలుసుయొక్క బలము, దానిలో అన్నిటికంటె బలహీనమైన మెలికపై ఆధారపడియున్నట్లు ఈ వృత్తుల ప్రతిష్ఠ అంతయూ ఇట్టివారిపై ఆధారపడియున్నది. ఈరోజులలో ప్లీడర్లలో చాలామందికి కాలము తమ ఇచ్ఛవచ్చినట్లు వినియోగించుకొనుటకు అవకాశమున్నది. ప్రతి సంవత్సరము క్రొత్తక్రొత్త ప్లీడర్లు చాలామంది వచ్చుచున్నారు. ప్లీడర్లలో ఎక్కువమంది బ్రాహ్మణులు ఉండుటచే లాకాలేజిలో ప్రవేశించుటకు, ఉద్యోగముల విషయములో గవర్నమెంటు ఆర్డరున్నట్లు బ్రాహ్మణులకు తక్కువ స్థానములు ఇవ్వవలసినదని, కొంతమంది బ్రాహ్మణులు చెప్పుకొనుచుండగా వింటిని. వయస్సుమీరిన మీదట ఈ వృత్తులలో బాగా ఆరితేరిన వారగుదురు; ప్రాక్టీసు ఎక్కువఅగును. అందువలన 60 సంవత్సరములు వచ్చినను వృత్తులనుంచి విరమించుకొనవలెనను నియమములేదు. ఎవరునూ మానివెయ్యరు. మంది ఎక్కువైన మీదట ప్రాక్టీసు అందరికినీ తగ్గును కదా. డాక్టర్లు ఇంకనూ ఎక్కువగా లేరు. సంఘము భరించగలిగిన దానికంటె ప్లీడర్లు ఎక్కువగా ఉన్నారు. వీరందరునూ ప్రాక్టీసు ఏవిధముగానైనను సంపాదింప ప్రయత్నింతురు. చాలామందికి కాలమంతయు ఈ ప్రయత్నముతోనే సరిపోవుచున్నది. ఫలమేమియూ లేకుండ స్పర్ధచేత విద్య వృద్ధిపొందినట్లు ప్రాక్టీసు కూడ వృద్ధిపొందును. పెద్ద పెద్ద ప్లీడర్లు ఒకరి ఇంటిపక్కన ఒకరు ఉన్నప్పటికి మాటాడుకొననివారు ఉన్నారు. బాగుగా ఆశకలిగినవాడు ముందరఉన్నవాడిని పక్కకు త్రోసి ఆ స్థానములో తాను నిలుచును. ఆ పని చేయలేనివాడు తనకు రెండు కేసులు వచ్చిన సంతోషించును, ఇతరునకు రాకపోయిన వాని సంతోషమునకు మేరయేఉండదు. ప్లీడర్లుగాని డాక్టర్లుగాని తమ గొప్పతనమును పేపర్లలో ప్రచురించుటకు వీలులేకుండ వచ్చినదిగాని లేనిచో వారి తెలివి అంతయూ చూపించెడివారు. అప్పుడు అడ్వర్టయిజమెంటు, సాహిత్యములో ఒక శాఖగా పాతుకొని ఉండెడిది.

వ్యాపారులను ఆశ్రయించుకొని డాక్టర్లు ప్లీడర్లు బ్రతుకుచున్నారు. వ్యాపారులు జనసామాన్యమును పీడించి తమ లాభములను సంపాదించుచున్నారు. ఇది అంతయు తిమింగిలగిల న్యాయముగా ఉన్నది. కష్టపడి చదువుకొని గొప్పవృత్తులలో ప్రవేశించి ఎంతె శ్రమపడి సంపాదించినను, ఒక్క చిన్న వ్యాపారితో సమానము కాలేకున్నాడు. అది మనసులో పెట్టుకొని ఖేదము నొందని విద్యాధికుడు లేడు. కాని చేయగలిగినదేమి. వ్యాపారికి మిగిలినవారందరూ లొంగిపోవలసి వచ్చినది. ఈ వ్యాపారులకు పర్మిట్లు సంపాదించి పెట్టుట ఇప్పుడు న్యాయవాద వృత్తిలో ముఖ్యమైన పనులలో ఒకటి. అన్ని వస్తువులకు గవర్నమెంటు కంట్రోలుగదా! కంట్రోలు సరుకులకు పర్మిట్లు సంపాదింపగలిగినవారు ఎక్కువ ధనమును సంపాదింప గలుగుచున్నారు. న్యాయమైనను అన్యాయమైనను క్లయంటు కోరినది సంపాదించి పెట్టుటయే ప్లీడరుయొక్క విధి -అని ప్లీడరు ధర్మశాస్త్రము. తాను దోషినని తాను చేసిన ఘోరమును క్లయింటు ప్లీడరునకు నివేదించినప్పటికిని ప్లీడరు ఆ సంగతులు బయటపెట్ట కూడదు అని రూలు ఉన్నది. ప్రతి కంపెనీకి ఒక లీగలు అడ్వైజరు ఉండవలెనని గవర్నమెంటు నిర్బంధించును. పన్నులను ఎగగొట్టు ఉపాయములను సక్రమముగా ఆలోచించి చెప్పవని కాబోలు ముందు చూపుగలిగి గవర్నమెంటే ఈపని చేసినది. ప్లీడర్లలో చాలా ప్రతిభ గలవారు ఉన్నారు. పైకి వచ్చిన వారందరూ (ఎక్కడనో తప్ప) ప్రతిభావంతులే. కాని ఒక్క ప్రతిభయే ఉన్నను చాలదు. ఇంకా కొన్ని ఉపాయములను కలిగి ఉండవలెను తన పార్టీకి అనుకూలములను కల్పించుకొనవలెను. తమకు తీరిక ఉన్నంతకాలమంతయూ ప్రాక్టీసు సంపాదించుటకు ఎక్కడోగిరట్లు తిరిగిరావలెను. తోడి ప్లీడర్లను వారు లేని అవమానము చూచుకొని వారి అసామర్థ్యమును ప్రకటించు దుర్వ్యాసన లావవలెను; తమ పార్టీయొక్క ప్రత్యర్థిని, వాని సాక్షులను ఉతికిమూచి భయభ్రాంతులను చేయవలెను. (ఈ చివరి రెండును చేయనక్కరలేదని ప్లీడర్లలో సామ్యులైనవారు, అవిగా ఆ పని చేయు చేతకానివారు చెప్పుదురు.) సంఘములో మిగిలినవారి అందరికంటెను ఎక్కువగా చదువుకొని కాలమంతయూ రెండు పక్షవాజ్యములు గెలుకొనుటకు కుట్ర పెట్టుచున్న పీరిని ఏమనవలయునో తెలియకున్నది. కాని ఈ మాటలకు ... సమాధానము చెప్పగలవారు ఉన్నారు. ... అననది బహు ఉన్నారు. అది ఇవి

సంపర్కమును సహించదట. ప్రాక్టీసు సంపాదింప దలచినవాడు ఇతర వ్యాపారములలో నిమగ్నుడు కాక తన పనిసే తాను చూచుకొనవలెనట. లేనిచో ప్రాక్టీసు లక్ష్మి లేచిపోవునట, కొంతవరకు ఇది నిజమే. ఈ పరిస్థితులను దేశములో అందరూ కలసి తెచ్చిపెట్టిరి. ఇటువంటి పరిస్థితులు ఉండవలసిన అవసరమున్నదా? కేసులను బనాయించు ప్రముఖులచేతిలో ఉండునట్లు చేసుకొనుటకు ప్లీడర్లు ఎల్లకాలము ప్రయత్నించుచూ ఉండవలసినదేనా? ఇతరుల పుండ్లను నిత్యము కడుగుచున్న డాక్టరు తన శరీరములో ఆక్రిమి ప్రవేశించకుండ చేసుకొనుటకు ఉపాయములు ఉన్నవి. కొంచెము శ్రద్ధ తీసికొనిన రోగిరోగము డాక్టరునకు సంక్రమించదు. కాని దుర్మార్గుల ప్రవర్తనతో నిరంతరము సంపర్కముకలిగి ఇతర వ్యాపారములను ముట్టక తన క్లయింటు లోకము

**[శ్రీ గరికిపాటి కృష్ణమూర్తి]**

లోనే జీవించు ప్లీడరు మనస్సునకు క్లయింటు దౌర్మార్గ్యము ఎక్కకఉండుటకు ఏమీ ఉపాయము కల్పింపబడలేదు. సత్ప్రవర్తన కలిగినవారెవరైనను దుష్ప్రవర్తనముల సంగతివినిన చకితులగుదురు. కాని ఎంత దుర్మార్గపుపని చేయబడినప్పటికిని ఆ సంగతి వినిన ప్లీడర్లు ఆశ్చర్యమును చెందరు. దానికి కారణము సంఘములోని మురికిఅంతయుపీరిమనస్సునకు నిరంతరము తగులుచుండుటయే

ఉద్యోగులమాట ఎత్తుటకేభయము. వారు ఏమిచేసినను చేయవచ్చునుగదా! చిన్న ఉద్యోగములనుంచి పెద్ద ఉద్యోగములు సంపాదించుటకు వారుచేయు ప్రయత్నములు వర్ణనాతీతములు. పెద్దఉద్యోగుల అభీష్టములను చిన్న ఉద్యోగులుతీర్చి వారి అభిమానమునకు పాత్రులగుటకు ప్రయత్నింతురు. ఉద్యోగులలో ఇప్పుడు ఉన్నట్లుగా లంచగొండితనము ఇదివరలో ఎప్పుడూ లేదని ప్రతి దేశములోను గగ్గోలు పడుచున్నారు. ఈ లంచగొండితనము కంట్రోలు సరుకులతోను బ్లాక్‌మార్కెట్‌తోను వృద్ధి చెందినది. వెనుక ఒకడు ఒక ఉద్యోగమునకు దరఖాస్తుచేయుచు తాను జీతములేకుండ పనిచేయుటయే గాక గవర్నమెంటునకు కొన్ని రూపాయిలు ఎదురు ఇత్తుననియును, ఒకవేళ ఈ జేరము గవర్నమెంటుకు సంతృప్తికరముగా లేకపోయిన ఆ ఉద్యోగమునకు బహిరంగముగా పాటపెట్టవలసినదని కోరెనట. ఇప్పుడుకూడ ఈ పనిజేయుటకు పరిస్థితులు అనుకూలముగానేఉన్నవి. ఉద్యోగుల ఇండ్లలో సరుకులకు ఇబ్బందియే ఉండదట. ఇక ఉద్యోగములేనివారో-వారి పాట్లు చూడవలెను. పంచదారసంగతి చూచిన, అది ఎంతకావలెనన్నను ఎక్కువధర పెట్టిన దొరకును. బస్తీలలో కాఫీ హోటళ్లవారు పంచదారకు ఇబ్బందిపడరు. కాని గృహస్థులు కావలెనన్నప్పుడు వారిఅవస్థ చూడవలసినదే. రేషనుకొట్లలమీద ఇచ్చు పంచదార అంతై, ఇంతై ఇంతింతై చివరకు పంచదారతెచ్చుకొనుటకు సంచినికూడ తీసికొని వెళ్లనవసరములేకుండా మారిచ్చినది అక్కడనే నోటిలో వేసికొనివచ్చుటకు వీలుగా ఉన్నది. బియ్యపు కరవువలన కట్టెలకరవువలన బ్రతికి యుండుటకు గాని చనిపోవుటకుగాని రోజులు వీలుగాలేవు. కట్టెలకరవు బియ్యపు కరవును మించియున్నది. ఈ పరిస్థితులు ఎక్కువకాలము ఈ విధముగనే ఉండిన గృహస్థులు ఇండ్లలో కాపురము చేయలేరు. గృహస్థులకే రోజులు సమీపించినట్లు కనుబడుచున్నది. రోడ్డుమీదకు వెళ్లి ఫలహారానంతరము మంగలిదుకాణము సేవించి, తరువాత మాలీసు చేయించుకొని భోజనముచేసి, హోటేలువారు సప్లయిచేయు పడక కుర్చీలలో శయనించి కాలము వెళ్లబుచ్చ గలిగిన రోజులు వచ్చినప్పుడు గృహమెందులకు గృహస్థధర్మమెందులకు. అమెరికా దేశములో సంసార బంధము సడలినందున అక్కడ వారిలో విజ్ఞులమనుకొన్నవారు గోలపెట్టుచున్నారు. మన దేశములో సంసార బంధము మిగుల క్షీణించినది. ఆ విధముగా మనము ఉండకూడదు. వివాహమనునది చాలా అవసరమైనది. ఆబంధము సడలిన మన సంఘము నాశనమై పోవును. పూర్వము గ్రీసురోములలో ఆ సామ్రాజ్యములు కూలి పోవుటకు ముందు ఈవిధమైన పరిస్థితులే ఏర్పడినవి. అప్పుడును గృహస్థాశ్రమ ధర్మములు సన్నగిలినవి. లంచగొండితనము - పెరిగినది, ఆకారణముచే ఆ సామ్రాజ్యములు పాడై పోయినవి. ఇప్పుడు మజల ఈ పరస్థితే ఏర్పడుటచే మన పాశ్చాత్య క్రైస్తవ నాగరికత నాశనమై పోవుచున్నది, అని అమెరికా పేపర్లవారు నెత్తిన నోరుబెట్టుకొని మొఱపెట్టుచున్నారు. పాశ్చాత్యులు పోయెడి దారినసే గదా మనము పోవలసినది. వారికి దురవస్థ ఇప్పుడే వచ్చినది, మనకింక 50 సంవత్సరములలో రాగలదు. ఇప్పుడే కొద్దికొద్దిగా సూచనలు కనుబడుచున్నవి. లంచగొండితనము దేశములో గల పెద్దపరిశ్రమలలో ఒక్కటి. దీనిని ఉత్తరించుటకు అందరునూ జడకంకణులే. కాని జరుగుచున్న పని అందరూ కలసి దీనిని ఉద్ధరించుటయే, గవర్నమెంటు దీనినణచుటకు ప్రత్యేకముగా ఒక శాఖను ఏర్పరచెను. దొంగను దొంగయే పట్టవలెను అను న్యాయమును అనుసరించి గవర్నమెంటు అట్టివారినే ఈపనికి బుద్ధిపూర్వకముగా ఏర్పాటుచేసినది అని లోకములో ఒక అపవాదు ఉన్నవి.

# ఆంధ్రసంస్కృతికి రూపకల్పనచేసిన నన్నయభట్టారకునికి నీరాజనం

## రాజమహేంద్రవరంలో జయంత్యుత్సవము

నవంబరు 17 : ఆదికవి, నాగరు శాసనుడు అయిన నన్నయ భట్టారకుని జయంత్యుత్సవము నిన్న యిచ్చటి కళాభిగరీ పరిషత్తు ఆధ్వర్యమున జయప్రదముగజరుపబడెను. నన్నయవంటి ఆదికవి జయంతి సంవత్సరమున ఒక ఆధునిక కవిని తనుకీతిని సన్మానించవలెనను తలంపుతో పరిషత్తు వారి సంకల్పము శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి నాహ్వానించిరి. సాయంత్రము శ్రీ కృష్ణశాస్త్రిగార్ని ఊరేగించుచు హిందూ సమాజమునకు తీసికొనివచ్చిరి. ఇచ్చట జరిగిన బహిరంగసభకు శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడుగారధ్యక్షత వహించిరి.

నన్నయ జన్మకాలం తెలియనందున, ఆయన తన ఆఖరి పద్యమును శరద్రాత్రి వర్ణనతో ముగించుటచేత యీ జయంతిని కార్తీక పౌర్ణమినాడు జరుపుట సముచితమని రెంచి పెద్దల సలహాపై నిట్లుచేయ సాహసించితిమని తెల్పుచూ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు నన్నయనిట్లు స్మరించిరి.

"ఆదికవీ! నన్నయభట్టారకా! నీవిచ్చిన కగితె సింహాసనం అన్నట్లు, పాండిత్యం, యిత్యాదికమంతా మా హృదయాలకు సుప్రతిష్ఠితమై వుంది. ఏమి చేయి ... భావా! వ్యాకరణం మా పారతంత్ర్యం తొలగిపోయింది. నీ స్వేచ్ఛా స్వాతంత్ర్యములు మాకిప్రసిద్ధమవుతున్నవి. స్వాతంత్ర్య స్వాతంత్ర్యమునకై రాజాధి రాజులకు పాలించిన నీ రాజనంగానికి పుష్టనుపుతున్నది. నిన్న ... నిన్న ... ఇంతనుంచే నిన్న పూజింపలేక పోయినందుకు సిగ్గుపడుచున్నాము. నిజమే. కాని యిప్పుడు మాకు సత్యం గోచరిస్తోంది. ఇంతకుముందే మేమిందుకు ప్రానుకొనియుంటే మా పూజను నీవు తిరస్కరించి యుండేవు. అదే తటస్థించినచో తరతరాలు - యుగ యుగాలు సస్యలో మేము పతమతే పోయిపోయి వుండవలసి వచ్చేది.

మహానుభావా! నీ పేరు తప్ప నీశాశ్వతిక సంపద మాకేమి లభించలేదు. నీ తల్లిదండ్రులు, నీ కుటుంబం, నీ వంశం-యీ సంగతులు మాకేమీ తెలియవు. అంతటి మహాప్రభువు రాజరాజ నరేంద్రుడు నీ జనన మరణాదికమయినా శిలాశాసనములు వేయించలేకపోయినాడు. ఇదంతా మాదురదృష్టం అనుకొంటున్నాము మేము. కాదు కాదు. మాకిపుడు బోధపడుతోంది. అంధ్రైక కుటుంబీకుడవు నీవు. కావ్యమును రూపొందించిగా నటబీసటగా నున్న ఆంధ్రభాషను అజరామరము, నిత్యనూతనము చేసిన దివ్యవైద్యుడవు నీవు. పంచమ వేదము నుపదేశించి తెనుగునాటికి శాశ్వతిక జీవను త్రోవ దిద్దిన బ్రహ్మర్షివి నీవు. ... గోదావరీ తీరమున కోటలింగ క్షేత్రమున బ్రహ్మమహత్తమైన నీ దివ్యతేజస్సు మా కన్నులకు గోచరిస్తున్నది. రాజమహేంద్రవరాన ... జననాయకత్వ ... ఆంధ్రసామ్రాజ్య ... వల్లభ ...

# నిరక్షరాస్యప్రజలలో విజ్ఞానవ్యాప్తికి 'వాస్తవిక చిత్రా'ల ఉపయోగం

## శ్రీ కపిల కాశీపతిగారి వివరణ

చెన్నరాష్ట్రీయ బ్రాడ్‌కాస్టింగ్ ఆఫీసరు శ్రీ కపిల కాశీపతిగారు మొన్న బుధవారంనాడు దక్షిణభారత ఫిలిం వాణిజ్య సంఘం అధ్వర్యాన జరిగిన సభలో వాస్తవిక చిత్రం అంటే ఏమిటో ప్రజలలో విజ్ఞానవ్యాప్తికి అవి ఎల్లా తోడ్పడతాయో బ్రిటన్‌లో వాటి నిర్మాణం ఎల్లాఆరంభమై అభివృద్ధి చెందిందో వివరిస్తూ ఉపన్యసించారు. సభకు సంఘాధ్యక్షుడు కె. సుబ్రహ్మణ్యంగారుఅధ్యక్షతవహించారు. వారు కాశీపతి గారిని సభ్యులకు పరిచయం చేస్తూ కాశీపతిగారు ఈమధ్యనే మనరాష్ట్రప్రభుత్వం తరఫున యూరోపులో పర్యటనం చేసి బ్రాడ్‌కాస్టింగు, ఫిల్ము శాఖలలో కొత్త విషయాలు తెలుసుకొని వచ్చినారని చెప్పారు.

కాశీపతిగారు ఇల్లా ఉపన్యసించారు: ప్రజలకి తాత్కాలిక వినోదమే గాని, చిత్రంవల్ల వేరే ఉపయోగం లేకుండా పోతుండడం గమనించినచిత్రనిర్మాతలలో ముందడుగు వేసేవారు, కొందరు వాస్తవిక చిత్రాలు తియ్యడం ప్రారంభించారు. వీటికి ప్రాతిపదిక మొదట రష్యాలోను, కొంత రకు జర్మనీలోను; తర్వాత ఫ్రాన్సులోనూ పడింది. అకళ రష్యాలో అభివృద్ధి పొందినంత ఎక్కడా కాలేదు. రష్యా మినహాయిస్తే, వాస్తవిక చిత్రాల నిర్మాణంలో బ్రిటనే ముందడుగు వేసింది. దీనికి కారణం బ్రిటిష్‌సామ్రాజ్య నిర్మాణంలోనేవుంది. బ్రిటనులో ఉత్పత్తి అయే పదార్థం ఒక బొగ్గు. దేశంచిన్నది. జనాభా పెద్దది. వీళ్లంతా బ్రతకాలంటే ఆహారం బైటనుంచిరావాలి. అది కొనడానికి ధనం కావాలి. అందుకోసం బ్రిటను ముడిపదార్థాలు ఇతరదేశాలనించి తెచ్చి, వస్త్రం మొదలైనవి తయారుచేసి, ఎగుమతి చేసి ఆధనం సేకరించడం ప్రారంభించింది. ముడిపదార్థాల కంట్రోలు కోసమే సామ్రాజ్య సేకరణ. అదే బ్రిటను ఆయువుపట్టు అందుకనే బ్రిటనుకి ఎగుమతివ్యాపారం చాలాముఖ్యం. కాని ఒకానొకప్పుడు బ్రిటిషు ప్రజలు ఈ విషయంలో అశ్రద్ధవహించారు. అందుకని బ్రిటిషు ప్రభుత్వం ఈ సందర్భంలో ప్రచారం చెయ్యడానికి వోసంస్థ ఏర్పాటుచేశారు. అప్పుడే బ్రిటనులో ప్రప్రథమంగా ప్రజాప్రచార పద్ధతుల విషయం అన్వేషణ, కృషి జరిగింది. ఆ కృషి ఫలితంగా బైటికి వచ్చిందే "వాస్తవిక చలనచిత్రం" దీనికి జనకుడు జాన్ గ్రియర్సన్ అనే స్కాట్లెండు దేశపు పెద్దమనిషి. ఈయనే తర్వాత కెనడాలోనూ, ఆస్ట్రేలియాలోనూ కూడా ప్రభుత్వంచేత ఫిలిములు తీయించడానికి ఏర్పాట్లుచేశాడు. అంతర్జాతీయసంస్థ. యు. ఎన్. ఓ. తరఫున కూడా శాంతి ప్రచారానికి ఫిలిము ఉపయోగించాలనే ఊహ మొదట్లో గ్రియర్సను తలలోనే పుట్టింది. ఈనాడు వాస్తవిక చలనచిత్రం, ప్రభుత్వ ప్రచారానికి, ప్రజా విద్యాసంస్థలకి, విద్యాలయాలకి, పారిశ్రామిక సంస్థలకి చాలా ఉపయోగపడుతోంది.

వాస్తవికచిత్రం అంటే ఏమిటి? ఉన్నదఉన్నట్లు తియ్యడం. ప్రపంచంలో చాలవరకు అశాంతికి, ఈర్ష్యకీ, ఆగ్రహానికి, వ్యక్తులమధ్య, దేశాలమధ్య, జాతులమధ్య ద్వేషానికీ అజ్ఞానం కారణం. వారినిగురించి వీరికి తెలియకపోవడం ఒకరి కష్టనష్టాలు, సాధక బాధకాలు మరొకరికి తెలియకపోవడం, పరస్పర సానుభూతి లేకపోడానికి ఈ అజ్ఞానం కారణం. ఆధునికజీవితం అంతస్తులలో పడిపోయింది. ఒక వృత్తిలో వున్నవారికి మరో వృత్తివారి జీవిత విశేషాలు తెలియవు ఆపోహలుతప్ప అసలు జ్ఞానంలేదు. అజ్ఞానం కలగజేస్తే మానవ జీవితంలో సంతోషం కలుగుతుంది. తార్కాణకి బ్రిటనులో నిత్యాహారాలలో ఒకటి చేప. ఈ చేప తన బల్లమీదికి ఎల్లా వొస్తుందో బ్రిటిషువారికి తెలియనిరోజులు వున్నాయి. ఆవుని చూడకుండా సీసాలో పాలు తాగే ఇంగ్లీషుపిల్లలకి పాలు ఎల్లా వొస్తాయో తెలియదు. గ్రియర్సన్ ఏం చేశాడంటే సముద్రంలో, చలిలో, నావ వేసుకుని, ఈ చేపలు ఎల్లా పట్టుకుంటారో, వొడ్డుకి ఎల్లా చేరుస్తారో, బాగుచేసి పెట్టెలలో ఎల్లా పెడతారో, అది దుకాణాలలోకి ఎల్లా వొస్తుందో, చివరికి వంట ఇంట్లోకి బల్లమీద ప్లేటులోకీ ఎల్లా వస్తుందో పూసగుచ్చినట్టు, సినిమా తీశాడు. దీనివల్ల వెంటనే 2 ప్రయోజనాలు కనబడ్డాయి. ఒకటి బ్రిటిష్ ప్రజలకి చేపల పరిశ్రమవిషయం జ్ఞానంకలిగింది. బ్రిటిష్ చేపలపరిశ్రమ రాణ హెచ్చింది. ఎన్ని పుస్తకాలు వ్రాస్తే, ఎన్ని అడ్వర్టయిజుమెంట్లు చేస్తే ఈ ప్రయోజనాలు కలుగుతాయి. తర్వాత ఆవులు, ఆవుపాలు పితకడం, అమ్మడం విషయం ఫిలిము తయారుచేయించాడు. వెంటనేదేశం నిండా ఆవుల కొడ్లు ఎక్కువైనాయి. బ్రిటిష్ ప్రజలకి మంచి పాలు దొరికాయి. ఇదో కొత్త ప్రచార పద్ధతి అని తెలుసుకున్నారు. సామ్రాజ్య దేశాలలో బ్రిటిష్ పరిశ్రమల మీద ఫిలుములు ప్రదర్శించారు. ఎగుమతి వర్తకం వృద్ధి అయింది. ఈవాస్తవిక ఫిలుము ద్వారా పుణ్యం, పురుషార్థం సాధించాడు గ్రియర్సన్.

దీన్ని "డాక్యుమెంటరీ" అన్నారు. ఈపదం "డాక్యుమెంటెయిర్" అనే ఫ్రెంచి పదంలోంచి వచ్చింది. తీర్థాలు విశ్రాంతి ప్రదేశాలు, యాత్రికుల కోసం చూపించడానికి ఫ్రెంచివాగు తీసిన చిత్రాలపేరు "డాక్యుమెంటయిర్." అవి నిజంగా వాస్తవిక ప్రదేశాలలో తీసిన ప్రచార చిత్రాలు. ఇప్పుడు కూడా ఫ్రాన్సులో ఏజనం సీనో కావాలంటే నిజంగా తీసిన సీనులే సినిమాల్లో పెడతారు. సెట్టింగులు ఉపయోగించరు.

ఈ "డాక్యుమెంటరీ" సృష్టించిన గ్రియర్సన్ చాలామంది శిష్యుల్ని తయారు చేశాడు. వారంతా వాస్తవిక చిత్రాలు తీశారు. దేశంలో నల్లులబాధవుంటేవాటిని ఎల్లా నిర్మూలం చెయ్యాలో వోఫిలుముతీసి ప్రజలకి చూపించారు. అల్లాగే ఎలుకల బాధ మొదలైనవి. ఆరోగ్య విషయాలు, 'పౌరహక్కులు, అంతర్జాతీయవిషయాలు, విద్యావిషయాలు అన్నీ డాక్యుమెంటరీ కిందే వస్తాయి. 1939 నాటికి బ్రిటనులో మొత్తం ఇటువంటివి 300 చిత్రాలుతీశారు. ఇంతలో యుద్ధం వచ్చింది. సైనికుల్ని, నావికుల్ని, వైమానికుల్ని, పారిశ్రామికుల్ని తయారు చెయ్యవలసివచ్చింది. చెప్పే మనుషులు తక్కువ. వెంటనే ఫిల్ము ఉపయోగించారు. శిక్షణ అంతా ఫిలుము ద్వారా నేర్పించారు. గ్రియర్సను మహత్యము అందరికీ బోధపడింది.

ఆ అనుభవంతో ఈనాడు బ్రిటిషు ప్రభుత్వ ప్రచారశాఖలో ఫిలుముశాఖ వో ముఖ్యాంగంగా చేశారు. దీనికి గ్రియర్సను పెద్ద. బ్రిటిషు ప్రభుత్వానికి పెద్ద సినిమా స్టుడియోలు వున్నాయి. బ్రిటనులో ఫిల్ము, కళకి, విద్యకి, విజ్ఞానానికి ఎల్లా ఉపయోగిస్తుంది అని విచారించడానికి, పనిచెయ్యడానికి అనేక సంస్థలు వున్నాయి. వాటిలో బ్రిటిషు ఫిలిం ఇన్‌స్టిట్యూట్ చాలా ముఖ్యమైనది. దేశంలో ఫిలిం లైబ్రేరీలువున్నవి. ప్రభుత్వం 144 సంచార సినిమాలద్వారా ప్రజకి అన్ని విషయాలు తెలియజేస్తుంది.

అంత విజ్ఞానవంతమైన బ్రిటనులోనే, చిన్నదేశమైనా 144 సంచార సినిమాలు వుంటే, ఏడులక్షల గ్రామాలువున్న భారతదేశంలో, ఎన్నివుండాలో మనం చెప్పలేము. మనదేశంలో నూటికి ఎనభై ఆరుగురు మనుషులికి చదవడం వ్రాయడంరాదు పత్రికలద్వారా పుస్తకాలద్వారా వారి విజ్ఞానం వృద్ధిచెయ్యడానికి వీలుకాదు దీనికి మార్గం సినిమా, రేడియో రెండే రేడియోకంటెకూడా సినిమా చాలా రెట్లు ఎక్కువ వుపయోగంకలది. మనకి స్వరాజ్యం సార్థకం అయి, ప్రయోజన నియోజకపు హక్కు సార్థకం కావాలంటే ప్రజలలో జ్ఞానప్రచారం అవసరం. మనకి కావలసిన ముఖ్యవిషయాలు,ఆహారవస్త్రాదులు ఆరోగ్యం, విద్య. ఈ నిరక్షరాస్య ప్రజని అభివృద్ధికి తీసుకురావాలంటే, ఇతర దేశాలసంగతులు వారికి చూపించి, జీవిత రహస్యాలు తెలియజెయ్యాలి. దీనికి ఫిలిం చాలావరకు సహాయం చెయ్యగలదు.

మనదేశంలో ప్రస్తుతం 2000 సినిమాలు మాత్రం వున్నాయి. సినిమాచూడనిప్రజలు ఎందరో వున్నారు. వున్న సినిమాలు చూపించడానికే వసతులులేవు. ప్రదర్శన వసతులు వృద్ధి కావాలి పరిశ్రమలతో నిండిన నగరాలులేని మన దేశం అంతటా ప్రదర్శనశాలలు ఏనాడో గాని రావు. దీనికి మార్గం పదహారు మిల్లిమీటర్ల చిన్న ఫిలిం. ఇది తగలబడు నిప్పుభయంలేదు. దీనికి రూల్సులేవు మోటారుబళ్లమీద ఏమూలకైనా తీసుకెళ్లవచ్చు వున్న ఫిలుములు 35 మి మీ లోంచి 16 మి మీ కి మార్చించి దేశమంతా చూపించవచ్చు లాభాలుకూడా వుంటాయి పుణ్యం పురుషార్థం ఈ విషయాలు పరిశీలించి, విద్యకి, విజ్ఞానానికి, కళకి సినిమా ఎల్లా తోడ్పడుతుంది అని విచారించి సలహాఇవ్వడానికి మనదేశంలో కూడా వో ఫిలిం ఇన్‌స్టిట్యూట్ వుండాలి

రేపు మద్రాసులో జరగబోయే అఖిల భారత ఖాదీ ప్రదర్శనంతో పాటు వోవాస్తవిక చలనచిత్ర ప్రదర్శనంకూడా పెడితే బాగుంటుంది

శ్రీ సుబ్రహ్మణ్యంగారు కాశీపతిగారికి వందనములు అర్పిస్తూ, తప్పకుండా అటువంటి ప్రదర్శనం ఏర్పాటు చేస్తామని అన్నారు వాస్తవిక చిత్రాలు తియ్యడంలో మన చిత్ర నిర్మాతలు కృషి చెయ్యాలన్నారు



వార్నర్ బ్రదర్స్‌వారి 'రొమాన్సు ఆన్ ది హై సీస్' అనే ఫిల్ములో జాక్ కార్సన్, జానిస్ పేజ్.

## న్యూయార్కులో 'కల్పన' ప్రదర్శనం

న్యూయార్కు, నవంబరు 14 సుప్రసిద్ధ భారతీయ నర్తకుడు ఉదయశంకర్ నిర్మించిన 'కల్పన' చిత్రం నిన్నరాత్రి న్యూయార్కులో ప్రథమ ప్రదర్శనం జరిగినప్పుడు 2 వేలకుపైగా అమెరికన్లు దానిని ప్రశంసించిరి ఈ ప్రదర్శనము ఈస్ట్ అండ్ వెస్ట్ (ప్రాచ్య ప్రతీచీ సంఘం) ఎసోసియేషన్ వారి ఆధ్వర్యమున జరిగెను ప్రదర్శనకు ముందు ఉదయశంకర్ ప్రేక్షకులకు దర్శన మివ్వగా వారు ఉత్సాహము వెల్లడించిరి సుప్రసిద్ధ రచయిత్రి పెరల్ బక్ మాట్లాడెను

## నన్నయభట్టారకునికి నీరాజనం

7 వ పేజి తరువాయి

x పంక్తులలో విహరించివచ్చి పండువన్నెల మమ్ము ప్రణతులను చేయుచున్నది. మాలోనే మేము నిన్ను చూసుకొనుచున్నాము. సత్యం - శివం - సుందరం అయినసీ సర్వస్వము మేము లెస్సగా గుర్తించుకోగల్గుచున్నాము. దయ చేయి మహానుభావా! ఇదిగో నీపాదముల యెదుట సాష్టాంగ పడి మేము విన్నపంచేసి కొంటున్నాము. ఇకముందు ప్రతిసంవత్సరము కార్తీక పూర్ణిమనాడు నిన్ను అవశ్యము పూజించుకొంటాము. నీ పేరుగా నీ రాజమహేంద్ర వరపు సంపన్నులు ప్రతిఏట ఒక పండిత కవిని నూటపదహార్లతోను, నూతన వస్త్రములతోను సత్కరింతుమని ప్రతిజ్ఞ చేయుచున్నారు! నీరచనలు చదివి నిన్ను అర్థం చేసి కొనుటకు తాపత్రయ పడుచున్న మేము తప్పక నీ అడుగు జాడలలో నడచు కొందుమని శపథం చేయుచున్నాము. నీ రాజమహేంద్రవరం నిత్య కల్యాణములతో పచ్చతోరణములతో అలరారునట్లు ఆశీర్వదించుము మహానుభావా"

శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుడుగారు తమ అధ్యక్షోపన్యాసంలో నన్నయ ప్రభావమును, ఆయన జయంతి జరుపవలసిన అవశ్యకతను గురించి మాట్లాడిన పిదప శ్రీ కృష్ణశాస్త్రిగార్కి నూటపదహార్లు నూతన వస్త్రములు సమర్పించిరి. ఈ నూటపదహార్లు శ్రీ చల్లా వెంకట అన్నపూర్ణయ్యగారున్నూ, మిగతే ఖర్చులకు వలయు ధనము కొందరు పౌరులును విరాళము లొసంగిరి.

తదను నన్నయ జయంతి సందర్భములో సన్మానించినందుకు, యీ జయంతి జరుపుటకు చాల దీక్షతో కృషిచేసినందుకు శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి ప్రభృతులకు కృతజ్ఞత తెలియజేసినతర్వాత నన్నయ భారతము లోని అనేక ఘట్టముల నుదహరించుచు నాటి సారాంశమును వివరించుచు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి ట్లుపన్యసించిరి.

"చాదాపు 950 సం॥ముల క్రిందట ఈ రాజమహేంద్రవరంలో నివసించి, యీ స్థలంలో విహరించిన ఆది కవి నన్నయ యొక్క జయంత్యుత్సవము యిచ్చట జరుగుట చాల ఆనందింపవలసిన విషయము. ఆంధ్ర సంస్కృతికి రూపకల్పనచేసి, ఆంధ్ర వాఙ్మయమునకు దృఢతరమగు పునాదివేసిన మహాకవి నన్నయ. ప్రజా సౌభాగ్యముకొరకు రాజరాజనరేంద్రుని కోరికపై భారతమును తెనిగించి తద్వారా సామ్రాజ్యమునే పరిపాలించిన మహావ్యక్తి నన్నయ. అయితే ఆయన కవిత్వంపైకూడ విమర్శలు లేకపోలేదు, ఆయన ఒకచోట వాడిన పదమును తరచువాడుచుండునని కొందరి విమర్శ. కాని అది పొరపాటు కాదు. ఆయన కవిత్వంలో ప్రతిఅక్షరం సందర్భానుసారంగా ప్రయోగింపబడినవే నన్నయకుపదములు రాక ప్రయోగించినవే మరొకచోట ప్రయోగించలేదు. శబ్దమునకు రెక్కలు కల్పించి ఎగురవేసి దూరమున నున్నవాటినికూడ దగ్గరకుచేర్చగల ప్రతిభాశాలి నన్నయ. ఇంకొక విషయమేమిటంటే కొందరు యిద్దరు కవులను పోల్చి ఎవ రెక్కువ ఎవరు తక్కువ అంటారు అది అసలే పొరపాటు. ఒకరిపద్ధతి వేరు మరొకరిపద్ధతి వేరు. ఉదాహరణకునన్నయ తిక్కనలను తీసికొందాము. నన్నయచేతిలో శబ్దం అవసరంకొద్దీ రెక్కలుగల పక్షియై దూరపు సంగతుల్ని దగ్గరకు చేర్చింది. కాని తిక్కనచేతిలో ఆ శబ్దమే మనిషియై తాను పలికింది. పలికించింది. ఇలా తేడా లుండుట గాన పోలికలు చాల తప్పు గొప్ప కవుల కెవరికి ఒక పక్షముపై అభిమానము రెండవపక్షముపై అసూయవుండవు. నన్నయకవిత్వంలో ప్రతి చోట యిది గోచరించుచుండును. అంతేగాక విషయములకు ప్రాధాన్యత నిర్ణయించుటలో నన్నయను మించినవారులేరు. అందుచేతనే కవితా పట్టాభిషిక్తుడు నన్నయ, లోకోత్తరుడైన కవియే ఋషిఅన్నారు. పెద్దలు నన్నయ్య యిట్టితరహాకు చెందినవాడే దేశం అల్లకల్లోలంగావున్న సమయమున భారతమును తెనిగించి ధర్మమార్గమును ప్రజానీకమునకు వెల్లడిచేసి తద్వారా శాంతి నెలకొల్పినాడు నన్నయ. దేశం నేడుకూడ అదేవిధముగ సంక్షుభితమై యున్నది. కాని యీనాడు నన్నయవంటి మహానుభావుడు బయలుదేర శాంతి నెలకొల్పునటు కల్ల, కనుకనే కవులందరు కలసిఅయినా ఒక్క నన్నయవలె తయారు కావల్సివుంది. ఈ అంశములన్నీ గుర్తుంచుకొని నన్నయను స్మరిస్తూ ఆయన అడుగు జాడలలో మనం నడవవలెను. ప్రతివరు ఆయన తెనిగించిన ఆ మహాభారతమును తప్పక చదివి తీరవలెను."

పిమ్మట "హాస్యబ్రహ్మ" శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు ప్రసంగించుచు మానవులంతా మరణించేవరకు పశువులై యుంటారని, యీ కవులుమాత్రం మరణించినమీదట సజీవులవుతారని యిప్పటికైనా మన కవుల ప్రభావాన్ని గుర్తించి ప్రతిప్రముఖ కవిజయంతిని తప్పక జరుపవలసిన భారం మనపైనున్నదని, అట్లుచేయుటకు ప్రజలందరు పూనుకొనవలెనని హెచ్చరించిరి శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి వందన సమర్పణములతో సభా కార్యక్రమము సమాప్తి చెందెను

## కవి : సమాజము

"ప్రజ అను మహాసముద్రంలో కవి కెరటము వంటివాడు కవికి సమాజమునకు చాల సన్నిహిత సంబంధముగలదు కావున కవి సమాజమునకు దగ్గరగా వచ్చి తదనుగుణ్యమగు సాహిత్యమును సృజించవలెను అట్లు సమాజమున కందుబాటులో నుండు కవిత్వమునకే యికముందు ప్రాధాన్యత కల్గును" అని నేటి సాయంత్రం యిచ్చట ట్రయినింగు కాలేజి ఆవరణలో శ్రీ యస్ రామచంద్రన్ (ప్రన్సిపాల్) గారి అధ్యక్షతను జరిగిన బహిరంగసభలో 'ఆంధ్ర కవిత్వము యొక్క భవిష్యత్తునుగురించి ప్రసంగించుచు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు నుడివిరి ప్రథమంలో శ్రీ దామెర్ల వెంకటరావుగారు కృష్ణశాస్త్రిగార్ని సభాసదులకు పరిచయంచేసిన తదుపరి కాలేజి విద్యార్థులు కృష్ణశాస్త్రిగార్ని దుశ్శాలువతో సన్మానించిరి సన్మానమునకు కృతజ్ఞత తెలుపుచు కృష్ణశాస్త్రిగారిట్లు ప్రసంగించిరి "ఈ నవయుగంలో సినిమా తారలు, రాజకీయవేత్తలు మున్నగువార్కి జరుగుచున్నంతగా సన్మానములు, సత్కారములు కవులకు జరుగుటలేదు కవుల పేదతనమే యిందుకు కారణమని తోచుచున్నది మరల యీ మధ్యకవులను గూడ ఉచిత రీతిని సత్కరించుచుండుట ఆనందింప దగిన విషయము సమాజాభ్యున్నతికి అవశ్యకమగు రచనలను కవులు సృజించునట్లు అన్నిరీతుల ప్రోత్సహించవలసిన బాధ్యత ప్రజానీకముపై నున్నది ఇపుడు కొందరు కవులు ప్రజల వాడుక భాషకు, పూర్వీకుల భాషకు కూడ దూరమైన సాహిత్యమును సృష్టించుచున్నారు ఇకముందు యిట్టి సాహిత్యమునకు గాక సమాజమునకు అందుబాటులో నుండు కవిత్వమునకే ప్రాముఖ్యత నీయబడగలదని ఆశించుచున్నాను"

## నగరంలో సినిమాలు

| | |
|---|---|
| పన్ | 'జ్ఞానసౌందరి' |
| సాగర్ | 'సైక్లోకార్డన్' |
| వెల్లింగ్టన్ | 'షహ్నాయ్' |
| స్టార్ | 'లాలాజీ' |
| పారగన్, ప్రభాత్ | 'భక్తశకుంతల'(?) |
| బ్రాడ్వే, గెయిటీ | 'యోగి వేమన' |
| సినిమా సెంట్రల్ | 'ఆద్మీ' |
| క్రౌన్ | 'హరిశ్చంద్ర' |
| సెలెక్టు | 'జుగ్ను' |
| సరస్వతి | 'చాంద్' |
| Casino: | 'Mr Blandings Builds His Dream House |
| Minerva | A Foreign Affair |
| New Elphinstone: | Baghdad Ka chor |
| New Globe | Romance on the High Seas' |
| Roxy | 'The Yearling |

## ఆంధ్రనాటక కళాపరిషత్తు

### కార్యవర్గ సమావేశము

ఏలూరు, నవంబరు 15 ఆంధ్రనాటక కళాపరిషత్ కార్యవర్గ సమావేశము నిన్న నిచ్చట శ్రీ త్రిపురనేని శివప్రసాదరావుగారి అధ్యక్షతక్రింద జరిగినది సపల సూర్యచంద్రరావు, దుక్కిపాటి మధుసూదనరావు, యర్రోజు మాధవాచార్యులు, కొర్పూరి సుబ్బారావు, మాధవపెద్ది వెంకట్రామయ్య, కోట రామబ్రహ్మం, పులిపాక రామచంద్రశాస్త్రి, కోడూరు అచ్చయ్య, బందా కనకలింగేశ్వరరావు, కొండముది గోపాలశర్మ, రాజ వెంకటరామయ్యగార్లు, హాజరైరి పరిషత్తు పదునేనవ మహాసభలు 1949 జనవరి 8,9,10,11 తేదీలలో ఏలూరులో జరుపుటకు నిర్ణయింపబడినది మహాసభా ప్రారంభకులుగా జస్టిసు ఎ వి రాజమన్నారుగారు ఆమోదము తెలియచేసినందుకు హర్షము వెలిబుచ్చబడినది మహాసభలకు ప్రదర్శనముల పోటీలలో పాల్గొన దరఖాస్తుచేసిన సమాజముల ప్రాథమిక ప్రదర్శనముల పరిశీలించుటకు ఒక ఉపసంఘము నియమింపబడినది మహాసభాధ్యక్షతకు ఒక పానలు నిర్ణయించుచు, ఆ ప్రకారము మరల కార్యవర్గము సమావేశమునలో పల అధ్యక్షనిర్ణయము చేయుటకు కార్యదర్శి కధికారమొసగబడినది

## మద్రాసు రేడియో

### (నవంబరు 22 సోమవారం)

మదరాసు 2

7 స్వాగతం 7 10 తె వార్తలు 7-20 రికార్డులు 7-30 ఎస్ జానకి, పాట, 8 ఇ వార్తలు 8-15 టాకీ రికార్డులు. 8 30 ఎస్ రామయ్య, పాట 12-30 హైస్కూళ్లకు ఇంగ్లీషులో రాష్ట్రంలో గ్రంథాలయాల గూర్చి ప్రసంగం 1 మదర్ నిగచి 1-30 ఇ వార్తలు 1 40 ఫిల్ము రికార్డులు 2-5 తెలుగులో వార్తలు. 2-15 హైస్కూళ్లకు తెలుగులో, పక్షుల గూర్చి ప్రసంగం కర్నాటక రాశి 2-45 రికార్డులు 4 ప్రాథమిక పాఠశాలలకు (అరవం) 4 30 ఇ వాయిద్యము 5-30 ఎస్ కె వేద, పాట 6 ఇ. వార్తలు 6-30 గ్రామస్థుల కార్యక్రమం. —పంటల మీద వ్యవసాయం ప్రసంగం. విశేషాలేమిటి 7-15 తె వార్తలు 7-30 ఓంకారనాథ ఠాకూర, రికార్డులు 7-45 మళయాళ ప్రసంగం 8 కె వి జానకి, పాట 8-30—డిల్లీ నుండి 9 ఇ వార్తలు. 9-15 కళారాధకులు—కె నరసింహారావు రచన 9-30 రికార్డులు 9 40 ఎ సుబ్బయ్య, ఫిడేలు 10 తెరగానం

## సంపాదకలేఖలు

### నూలు సరఫరా లోపం

అర్యా,

తూర్పు గోదావరిజిల్లాలోని 28,000 చేనేత మగ్గాలలో 15,000 సహకార సంఘాల్లో చేరివున్నాయి మిగిలిన 13 వేలకు ప్రభుత్వంవారు నూలు సప్లయిచేయవలసివున్నది ఈజిల్లాకు ప్రభుత్వం 816 నూలుబేళ్ల కోటాను నిర్ణయించారు ఇందు సహకార సంఘాల్లో చేరినవారికి సప్లై చేసిన 719 బేళ్లు మిగిలిన 97 బేళ్లు నవ్వారుసేత, చేపవలలు, బనియనుల ఫ్యాక్టరీలు మున్నగు వివిధ ప్రయోజనములకు ఉద్దేశింపబడినవి ఈవిధంగా సంఘాల్లో చేరక మిగిలియున్న 13 వేల మంది పారిశ్రామికులకు కోటా లేనేలేదు. ప్రభుత్వం ఈ అన్యాయాన్ని గుర్తించి, సహకారసంఘాల్లో చేరని ఈ 13 వేల మందికి కనీసం నెలకు 500 బేళ్లు అయినా నిర్ణయించవలెనని కోరుచున్నాను

ఇనుమర్తి వీరభద్రరావు,
రాజమహేంద్రవరం.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras.